వెల
రూపాయి

## హెచ్చరిక

కేవలం వినోదం నిమిత్తమైనా సరే లేక సొమ్ము వసూలు చేసుకొనేనిమిత్తమైనా సరే, ఈ ప్రదర్శనాలలో ఏదైనా సభఎదట ఆడదలచిన ప్రతిసంఘంవారున్నూ ముందుగానే గ్రంథకర్తకి వ్రాసి లిఖితానుమతి పొందకపోవడం, కాపీరైట్ చట్ట ప్రకారం ఒకనేరం గనక, ఆ సంగతి గమనించి లిఖితానుమతి పొంది తరవాతనే ఆడుకోవాలి.

భమిడిపాటి కామేశ్వరరావు
రాజమండ్రి

కొండపల్లి ముద్రాశాల
రాజమండ్రి

మొదటి ముద్రణ
1955

## వి ష య సూ చి క

# భాసుడు

భాసుడు (క్రీస్తుపూర్వము 350 నాటి) ప్రాచీన ప్రముఖ ప్రశస్త ప్రసన్న సంస్కృత నాటకకర్త. కాళిదాసు అతణ్ణి స్మరించాడు. భాస నాటకాలు పన్నెండు పైచిలుకు ఉన్నా, ఎవళ్లో వాటిని అణిచేశారా అన్నట్టు అవి నలభైయేళ్ళక్రితం దాకా నామావశిష్టంగా ఉండిపోయాయి. బహుశా అతని పురాణ నాటకాలలో, అతడు పురాణలిఖితంకాని సంగతులూ పురాణ విరుద్ధం అయిన విశేషాంశాలూ జొనిపి స్వాతంత్ర్యం చూపించడంవల్లనేమో, అతని రచన అంతకాలం మరుగున పడిఉండడం! ఏమైతేం గనక, ఎప్పుడో ఒకప్పుడు అవి దొరికిఉండడం ప్రపంచనాటక సారస్వతంయొక్క అదృష్టం. నవీనులు కనిపెట్టిన ఏకాంకికలు అతనికి తెలిసినట్టు కనిపిస్తుంది. అతడు పెద్దకథ పట్టుకుని అదంతా నాటకీస్తూ కూచోడు. ఆ కథలో నాటకం ఎక్కడుందో చూపిస్తాడు. కొద్దిమాటలతో అతడు పాత్రలకి జీవం పొయ్యడమే కాదు, వ్యక్తిత్వం కూడా ప్రసాదించగల స్రష్ట. ఏపాత్ర ఎప్పుడు ఏమాట ఎంతవరకు ఏరీతిగా అనాలో అనిపించగల ఔచిత్యం అతని సొమ్ము. దేవుడంటేవాడికి అతడు మచ్చ చూపించగలడు. రాక్షసికి హృదయం ఉందని నిరూపించగలడు. ప్రతీ పాత్రనీ అతడు ప్రేమించే చిత్రించాడు. మానవప్రకృతి చిత్రణం కూడావిడిలో అనుగుణంగా ప్రకృతిని వర్ణించడం అతడు వదలలేదు. పండితకవిప్రకాండులు భాసరూపకాల్ని ఆంధ్రంలోకి అనువదించారు. అసంపూర్తిగా నిల్చిపోయిన 'చారుదత్తం' తప్ప తక్కిన పన్నెండింటినీ ఆచరణకి అనుకూలించేలాగున మార్చి నేను ప్రకటించడంలో 'మధ్యముడు' అనే సంపుటంలో అయిదు, 'బాలకేసరి' అనే సంపుటంలో మూడు, 'ప్రతిమ' అనే సంపుటంలో రెండు, 'స్వప్నం' అనే సంపుటంలో రెండు మీరు గమనింపగలరు.

ఈ సందర్భంలో, మద్రాసు హైకోర్టు న్యాయమూర్తులలో ఒకరైన శ్రీ॥ ఎ. యస్. పి. అయ్యర్ యం. ఏ., ఐ. సి. యస్., బార్-ఎట్-లా రచించిన "హైందవ సాంస్కృతుల సంపద - భాసుడు" అనే ఆంగ్ల గద్య గ్రంథం కూడా నాకు తోడ్పడింది. వారికి నా కృతజ్ఞతాపూర్వకవందనాలు.

అనుసరణకర్త.

# బా ల కే స రి

(అయిదు రంగాల రూపకం)

## పా త్ర లు

| | |
|---|---|
| కుంతిభోజుడు | (వైరస్త్యరాజు) |
| కౌంజాయనుడు | (చాదస్తపు మంత్రి) |
| భూతికుడు | (మంత్రి) |
| విష్ణుసేనుడు (బాలకేసరి) | (కుంతిభోజుని మేనల్లుడు) |
| సంతుష్టుడు | (విష్ణుసేన మిత్రుడు) |
| కురంగి | (కుంతిభోజుని కూతురు) |
| నళినిక | (దాసి) |

## రంగాల పేర్లు

1 కురంగికి గండం దాటడం

2 రాయబారికి వాగ్దానం

3 అంతఃపుర ప్రవేశం

4 ఆత్మహత్యకి ఆటంకం

5 రెండుత్తరాలు, మూడు పెళ్ళిళ్ళు

## రంగం—వచ్చే పాత్రలు

1—కుం, కౌం, భూ
2—న, బా, సం
3—సం. బా. న, కు
4—బా, సం, కు, న
5—సం,న, కుం, వి(బం)

## పాత్ర—వచ్చే రంగాలు

కుం—1, 5
కౌం—1
భూ—1
బా—(వి)-2, 3, 4. 5
సం—2, 3, 4, 5
కు—3, 4
న—2, 3, 4, 5

# రంగం-1

[గొప్పగా అలంకరించిన సమావేశమందిరం. దింగుకి ఆనుకుని కుంతి భోజ మహారాజు కూర్చుంటాడు.]

కుం—(తనలో) ఔర ! రాజగికం కేసి రాజు దృష్టితో చూస్తే స్వాతంత్ర్యశూన్యం, ప్రజలదృష్టితో చూస్తే హృదయశూన్యం ! అనుక్షణమూ పరిపాలనగురించి కొత్త బాధ. భూమిని నిజంగా మోసినంత బరువు. చట్టాలు పాటించాలి, రాగద్వేషాలు మాటుపరుచుగోవాలి, అవసరాల్నిబట్టి మెత్తగానూ కరుకుగానూ కనిపించాలి, ప్రజల పన్లూ ఊహాలూ గుర్తించాలి, పొరుగు రాజుల సంగతులు గ్రహించడానికి చారుల్ని పెట్టాలి, మంత్రుల మనస్సులు పసికట్టాలి, కాపుదలపెట్టుగుని ప్రాణాలు కాపాడుకోవాలి. ఇంతా చేసి యుద్ధసమయంలో రంగముఖాన్ని ప్రాణాలు గిరవపెయ్యాలి. అయినాసరే, రాజరికం ఎవడు చెయ్య లేడేమిటి అనిపిస్తుంది, కడంవాళ్ళకి! రాజరికం చెయ్యాలనే వ్యామోహం లేనివాడుండడు. రాజరికంలో దూరాన్నించి పాన్పులు ఆహ్వానం చేస్తాయి, దగ్గిరికెళ్ళగానే చిక్కులు స్వాగతం ఇస్తాయి.

ఇంటిసంగతి చూడడానికి వీలుండదు, తల్చుగోడానికి వ్యవధిఉండదు. అమ్మాయికి పెళ్ళి యీడువచ్చింది. రాణిగారు పిల్లపెళ్ళిగురించి రాపాడించేస్తోంది. సంబంధం ఒక్కో—

క్కప్పుడు ఏదీ కనిపించదు, మరొకప్పుడు రెండుమూడు ఏక కాలంలో కనిపిస్తాయి, వాటిలో ఒకటి నిర్ణయించుగోడం తెమల్దు. ఇప్పుడు ఈ రొంపిలోపడ్డాం. సోదరి సుదర్శనకి కొడుకు, కాశీయువరాజు, జయవర్మ! సోదరి సుచేతనకి కొడుకు విష్ణుసేనుడు! కురంగిని సుదర్శన కొడుక్కే ఇస్తానని నా వాగ్దానం. విష్ణుసేనుడు నాకే కాక తనకికూడా మేనల్లు డవడంచేత విష్ణుసేనుడికే కురంగిని చెయ్యాలని మహారాణి పట్టు. పట్టుపట్టి ఊరుకుందా? సుచేతనగారి నగరంచేరి తన సోదరుడితో మాట్లాడివస్తానని తనే వెళ్ళింది. అసలు అమ్మాయి మనస్సేమిటో తెలుసుగోనేలేదు. పిల్లకి నచ్చని ఘటానికి పిల్లని ముడెట్టేస్తే అక్కడితో తీరిపోతుందా? దాని ఉద్రేకం ఉభయవంశాల్నీ ఊడ్చేస్తుంది—వరదకాలంలో నది రెండుగట్లనీకూడా కొట్టేసినట్లు! (కు. మ. కేసి వినడం నటించి) ఏమిటిచెప్మా, ఆ కోలాహలం! కౌంజాయన మంత్రిని తీసుకురమ్మని పంపిన భటుడు ఇంకా రాలేదే! ప్రమదావనం నించి కురంగి రాలేదే!

[కు. మ. నించి కౌంజాయనుడు కంగారుగా వస్తాడు]

కౌం—(కు. మ. నించి వస్తూ)—(తనలో)—అబ్బ! పరిస్థితులన్నీ సరిగ్గా ఉంటే, రాజుగారిమూలాన్ని, అంటారు. అసందర్భం ఏమన్నా జరిగితే, మంత్రులనెత్తిని పెడతారు. (పైకి) జయం జయం మహారాజా!

కుం—ఏం మంత్రివర్యా! అల్లా ఉన్నారేం?

కౌం—ఏమీలేదు, ప్రభూ!

కుం—కురంగి ఇంకా రాలేదే! ప్రమదావనంలో ఎవరున్నారు ఆమెతో కుబ్జా? చంద్రికేనా? నళినికా?

కౌం—చిత్తం! కాని.........

కుం—ఏమిటి చెప్పండీ,

కౌం—మన ఏనుగు లేదండీ, అంజనగిరీ! ఆ యేనుగు కట్టుగొలుసులు తెంపుగుని, చెలరేగి, మావటివాణ్ణి పడగొట్టి చీరి పారేసి పరిగెడుతూ ఒంటినిండా దుమ్ము చల్లుకుంది. అంతకిపూర్వమే సుబ్బరంగా స్నానం చెయించారు కదా, ఒళ్ళంతా బాడిచేసుకోవడం దానికి ఎందుకొచ్చినపని చెప్పండి! ఆ ధూళితో అది మరీ జీమూతంలా తయారై వాయువేగంతో విహరించింది. ఆమాటకొస్తే వాయువేగం తక్కువే అనాలి. తన ధైర్యం ప్రకటించుగునే సమయంలోనే తనని అడ్డుకోవలిచిన మంత్రుల పిరికితనంకూడా ఋజువు చెయ్యాలని దాని దుద్దేశం.

కుం—మంత్రివర్యా! మీ ధోరణి ఎప్పటికీ ఒకే మాదిరిగా ఉంది. అమ్మాయి క్షేమమేనా?

కౌం—చిత్తం మహాప్రభూ! క్షేమమే. కాని, ఆ యేనుగు కనపరిచిన కయ్యాలీకి హడిలిపోయి జనం పిక్కబలం చూపించారు. ఆడంగులు హాహా కారాలు చేశారు. సాహసించి అడ్డిన జనాన్ని ఏనుగు నెట్టి పారేసింది. యువ

రాణిగారి రక్షణార్థం నేనూ నీతిగుప్తుడూ వనద్వారాలు కాశాం. ఏనుగు ఆకస్మికంగా తొండంతో నీరు చిమ్ముతూ యువరాణిగారి శకటం కేసి ఎగపడింది. నాకు కళ్ళు చీకట్లు కమ్మేశాయి. కాని ఒక యువకుడు—మాంచి రూపసి, చక్కగా మిసమిసలాడుతూ ఉన్నవాడు, తెగ మొగమాటస్తుడు, మిక్కిలి ధైర్యశాలి, బహు నాగరికుడు, అతి కోమలుడు, ఎంతో బలాసి—ధైర్యంగా వెళ్ళి చేత్తో ఏనుగుని చరిచాడు! అతడిమీద కొత్తకోపం బయల్దేరగా, ఆ యేనుగు యువరాణిని వదిలిపెట్టి అతణ్ణి చంపడానికి వెళ్ళింది. ఆ దోసందులో శకటంలోంచి దూకేసిన యువరాణిగారిని మళ్ళీ శకటంలోకి ఎక్కించి భూతికమంత్రీ నేనూ కలిసి ఆవిణ్ణి ఇంటికి చేర్పించాం.

కుం—ఇక్కడికి ధన్యులం. కురంగిని సంరక్షించిన ఆ యువకుడియొక్క వంశాదికం కనుక్కున్నారా?

కౌం—నాకూ ఆ కుతూహలమే వేసి కనుక్కున్నాను, ప్రభూ! కనుక్కుంటే, తను ఏదో నీచజాతికి చెందినవాణ్ణన్నాడు.

కుం—ధైర్య స్థైర్య ఔదార్యాలు ప్రకటన అవుతూన్నప్పుడు నీచజాతి అంటే నమ్మడం ఎట్లా? భూతికామాత్యుడు రాలేదే?

కాం—ఆ యువకుడి వయినం ఇంకా తెలుసుగునే నిమిత్తం ఆయన అతడి వెనకాలే వెళ్ళారు. (కు. ఎ. కేసి చూస్తూ) ఇదుగో, వస్తున్నారు.

భూ—(కు. ఎ. నించి వస్తూ) జయం జయం మహా రాజా !

కుం—రండి, అమాత్యా ! మన కురంగిని కాపాడే నిమిత్తం తన ప్రాణాలు లెక్క చెయ్యని ఆ యువకుడి జాడ ఏమన్నా తీశారా ?

భూ—ప్రభూ ! అతడు ఆ ఏనుగుతో పెంపుడు జంతువుతోలాగ కొంతసేపు ఆడి దాన్ని మెలికలు మెలికలుగా నడిపించాడు. అది దిగ్భ్రమ చెంది ఆగిపోయింది. జనం హర్షధ్వనులు చేశారు. ఆ స్తోత్రాలకి మొహమాట పడ్డాడా అన్నట్టు అతడు మెల్లిగా తన యింటికి దారితీశాడు. ఇంతలో ఆడ ఏనుగుల్ని తెచ్చి అంజనగిరిని బంధించి సాలలో ఉంచారు. వెంటనే నే నతణ్ణి వెంబడించాను, ప్రభూ, అతని వంశాదికం కనుక్కోవాలని! అతడు నిస్సందేహంగా గొప్ప పుట్టుకవాడననీ్న కారణాంతరంవల్ల తన పుట్టుక కప్పిపుచ్చి హీనజాతివాడిలాగ నటిస్తున్నాడనీ్న నా నమ్మకం.

కుం—అతడి రూపం ?

భూ—కొట్టవస్తోంది.

కుం—సంభాషణ ?

భూ—దోషరహితం.

కుం—ఆకారం ?

భూ—యోధ వీరుడికి ఉండే రకం.

కుం—బలం ?

భూ—అపారం.

కుం—వైఖరి ?

భూ—కోమలం.

కుం—వర్ణం ?

భూ—వర్ణం మాత్రం నలుపు.

కుం—అరె ! వివాహితుడా ?

భూ—మహాప్రభూ ! ఆసంగతి నేను అడగలేదు.

కుం—ఆ, ఇటువంటి కొడుకుని గలిగుండవలిసినవాడే.

భూ—అతడూ నలుపే. కాని మబ్బు కమ్మిన సూర్య తేజంలాగ వారి వర్చస్సు కళ్ళల్లో గోచరిస్తూనే ఉంది.

కుం—సరే అమాత్యా ! మరి, కురంగి వివాహం మాటేమిటి ? కాశీరాజుగారి రాయబారికి సమాధానం ఏం పంపుదాం ?

భూ—అలాంటి రాయబారాలు ఇంకా చాలావస్తాయి మహాప్రభూ ! రూపమూ ఆరిందా రెండూ కలిగి ఉన్న మన కురంగి కోసం యువరాజులు తండతండాలుగా వచ్చి మూసురుతారు—బహుమానంకోసం పహిల్వాన్లలాగ. మనం

అతడికి ఏదేనా అసహ్యారోగం పుట్టిందో, అతడు ప్రజల ప్రభు భక్తిని పరీక్షిస్తున్నాడో, లేక ఏదేనా శాపం అనుభవిస్తున్నాడో! మీరు కనుక్కోవాలి.

భూ—చిత్తం, కాని, మహారాణిగారు వెళ్ళింది కుడా అందుకే కదా! వారి దగ్గిర్నించి వార్తేనా వస్తుందీ, లేక పోతే వారే వచ్చేస్తారు.

కుం—అవును. కౌంజాయనా! కాశీరాయబారిని ఎంజేద్దాం?

కౌం—సగౌరవంగా విడిది చెయిస్తాం. అతణ్ణి నిరాశలో పడనియ్యం. మనం దార్లన్నీ తీసి అట్టేపెట్టుగుంటే గాని వివాహాలు తృప్తిగా నెరవేరవు, మహాప్రభూ! నేను మంత్రిని గదా, వ్యవహారం మొదటా, మొహమాటం తరవాతానూ! సెలవు!

కుం—సరే.

కౌం—(ఎ. మ. కి పోతాడు)

భూ—స్నానవేళ అయింది. అమ్మాయిని చూడాలి, తమరు దైవకృపవల్ల అమ్మాయికి గండం గడవడం జరిగిన సంతోషం కొద్దీ మిమ్మల్ని చూడవచ్చిన ప్రజలకి ప్రభువువారు దర్శనం కుడా ఇయ్యాలి. లెండి.

కుం—(లేచి, ఎ. మ. కి నడుస్తూంటాడు)

భూ—(రాజు వెనకాలే వెడతాడు)

(తెర)

# రంగం-2

(రెండవ తెర ఎదట, ఎ. ఎ. నించి నళినిక ప్రవేస్తుంది)

న—(తనలో) ఇదే ఆ బాలకేసరి ఇల్లు, ప్రేమలో ఔదార్యం చాలా ప్రమాదకరం. కురంగిని రహస్యంగా కలుసుకోడానికి ఈయన్ని పిలిస్తినా, రాజకుటుంబానికి తలవంపు మానేస్తినా, కురంగి బతికే యెత్తులేదు. ఇతణ్ణి చూసిన క్షణాన్నించీ కురంగి ధ్యాస మారిపోయింది. ఆహారం లేదు, అలంకరణం లేదు, మాటాపలుకూ కుడా లేదు. ఏక నిట్టూర్చడం, అర్థంలేని మాటలు అడుతూండడం, ఎదటివాళ్ళు ఏమంటున్నారో వినిపించుకోకపోవడం, తనలో తను నవ్వుకోవడం, ఒంటరిగా కూచుని ఏడవడం! ఆరోజు కారోజు మరీదిగనారి పోతోంది. కాని, చిత్రం ఏమిటంటే, ఇన్ని అవస్థలూ పడుతూ, ఏ ఒకళ్ళ దగ్గిరా కుడా పెదిమి విప్పదు. అయితేం, నాకు తెలియదూ! ఉన్న చిక్కేమిటంటే, ఈయన హీనజన్ముణ్ణంటాడు. ఎట్లా నమ్మడం? భూతికమంత్రి ఈయన క్షత్రియుడే అయి ఉండాలంటాడు. ఏమైతేం? ఇల్లు తెలుసుగున్నాను, వచ్చాను. చెబుతాను. వింటాడు. వినకేంజేస్తాడూ? వినడం సహజం. వినివచ్చి కురంగిని చూశాడా! అవుతుంది మంగళం. కురంగినిచూస్తే, ప్రేమదేవుడు కుడా ప్రేమాగ్నిలో పడతాడు.

(అని, [illegible] వాపమీద మ. మ. ని [illegible] ఉంటారు. [illegible] మ. నించి రాబోయి మళ్ళీ వెనక్కి [illegible]).

శా—(తనలో) [illegible] పడను. కళ్ళల్లో ఎంతభయం! [illegible] తొండంతో చిమ్మిన [illegible]! (అని లేవబోయి) అరె! కురంగి [illegible]! [illegible] దృశ్యమా! ఆ దృశ్యం [illegible] నా స్వప్న దృశ్యాలన్నీ అవే. నేను నిద్రపోయింటే నాకు స్వప్నం ఎల్లా వస్తుంటుంది! జాగ్రదవస్థే నన్ను [illegible]! జాగ్రత్తే అసిద్ధంలా ఉంది. నా నేత్రద్వంద్వ [illegible] చూడాలని! నా హృదయాభిలాష [illegible] ఆరాధించాలని! నా సుఖం పాలిపోయింది, నా శరీరం [illegible] పోయింది. దుఃఖంలో పగళ్ళూ భ్రాంతిలో రాత్రుళ్ళూ నెట్టేస్తున్నాను. ఇంతా అయినా నా ప్రేమ అంతకంతకీ బలీయం అవుతోంది. ఛ. ఇక ఆలోచన్లు మానేసెయ్యాలి. ఆమె సౌందర్యానికి ఎంత సమగ్రం! సృష్టికర్త సౌందర్యానికి తార్కాణ చూపించదలిచాడో, లేక తారాకాంతులు స్త్రీత్వం ధరించాడో, లేక లక్ష్మి అవతరించి కురంగి అయిందో! శాస్త్రం చెప్పినట్టుంది, నేను మళ్ళీ ఆమె స్మరణే! ఆమె గురించిన ఆలోచన చెయ్యకూడదు, అని నేను ఎంత అనుకున్నా, నా

మనస్సు ఘామతీసి ఆమెకేసి వెళ్ళే మామూలు దారిలోకి దూకుతోంది—నాలాంటివాళ్లు పఠించని వేదపాఠం, మనం కోరకపోయినా, తలలో గింగురుమంటూ వినిపిస్తూన్నట్టు! నా మనస్సుయొక్క శక్తి నా వశ్యానికి లేదు. అందుకని, ఆలోచనే నా కర్తవ్యం. స్త్రీజాతికి ఉండగల ఆకర్షణలు, అన్నీ, ఒక్కరాత్రిలో ఎక్కడ నశించిపోయాకదా! (అని, నిట్టూర్పు విడుస్తాడు).

న—(కు. మ. నించి వస్తూ) స్వామీ! వందనం.

బా—(ఉలిక్కిపడి ఆమెకేసి తిరుగుతూ) మీరెవరూ?

న—నా పేరు నళినిక!

బా—(ఎక్కడో చూసిన జ్ఞాపకం తట్టిస్తూ) ఓ. ఏమిటి సెలవు?

న—(మాట్లాడదు).

బా—ఏం పనిమీద వచ్చారు?

న—(సందేహించుతూ) వెంటనే ఎల్లానండీ చెప్పడం?

బా—మరి చెప్పకుండానే తెలిసిపోతాయా సంగతులన్నీ! పోనీ నిదానించిన మీదటే చెప్పండి.

న—మీరు క్షేమమా అండి?

బా—ఇదుగో. చూస్తున్నారుగా!

న—(ఎ. మ. కేసి చూస్తూ) మనవారెవరూ లేనట్టున్నారు.

బా—లేరు.

న—తమరు ఒంటరిగా ఆలోచిస్తున్నారు, దేన్నిగురించి?

బా—ఏదో శాస్త్రవిషయం.

న—ఏమిశాస్త్రం, మహాశయా ?

బా—సంయోగశాస్త్రం.

న—(నవ్వి ఆగి) చాలా ఆశ్చర్యంగా ఉంది, సామీ !

బా—అరె. పరిచయం లేందే, అప్పుడే నవ్వుతున్నావేం ?

న—మేమూ అదే ఆలోచిస్తున్నాం.

బా—మేం ఎవరూ ?

న—నేనూ నా యజమానురాలూనూ.

బా—అయితే, నువ్వానే మాటేమిటి ?

న—నేననేదా ? సంయోగం గురించి ఒక రికృడా మరొక రకృడా బుర్ర వెచ్చించేకంటె, సమావేశం అయి ఆలోచిస్తే నయం అని—శాస్త్రాచరణలో మేం మీకు తోడ్పడవచ్చుగదా, అని.

బా—ఓహోహో ! మాచెడ్డ కుతర్కం నేర్చుగున్నావే! అసలు సమావేశం కావడం ఎల్లాగా అనేది చర్చావిషయం అవుతూన్నప్పుడు, సమావేశం అయి ఆలోచిస్తే నయం, అంటావేమిటి ?

న—మా స్థలంలో సమావేశం అయే వీళ్ళున్నాయి గనక.

బా—మీ స్థలం అంటే ?

న—అంతఃపురం.

బా—ఏమిటీ ? ఎవరు మీ యజమానురాలూ ?

న—యువరాణి, కురంగి. ఏనుగునించి ప్రమదావనంలో మీరు రక్షించిన అబల.

బా—ఆహా ! నువ్వు ఆ దాసీవా ? నళినికా నీపేరు ? ఇదంతా నిజమా ?

న—ఎదంతా ? నిజంకాక, అబద్ధం అయితే ఇంత దీర్ఘంగా ఉంటుందాండీ ?

బా—నీమాటతో నాకు ప్రాణాలు లేచివస్తున్నాయి. కాని, ఈ దృశ్యం నమ్మవచ్చా, అని ! నేను హీనజాతివాణ్ణి కదా !

న—ఆమాట మరి మానేసెయ్యండి. వస్తారా, రారా ?

బా—ఎక్కడికి ?

న—ముందు అనండి వస్తానని, తరవాత చెబుతాను ఎక్కడికో.

బా—వస్తాను. ఎక్కడికి ?

న—యువరాణి అంతఃపురానికి.

బా—ఎప్పుడు ?

న—రాత్రి.

బా—అక్కడ [illegible] ?

న—ఒక మహా[illegible] ఉంటూంటారు. కాని, ఈ రాత్రి ఆయన ఒక రాచకార్యం చక్కబెట్టడానికి వెళ్ళాలిగనక వారి గురించిన భయంలేదు.

బా—ద్వారాలు ?

న—అగ్నిప్రాకారాల ద్వారాలగురించీ మీ కెందుకూ? మీరు ఉత్తరద్వారం మీదుగా ప్రవేశించండి.

బా—అక్కడ భటులుండరూ ?

న—పోనీ, ఈ రాత్రి అక్కడ ఆడవాళ్ళను పెడతాంలెండి.

బా—అంత భయంలేదు. సంగతి అడిగాను.

న—వస్తాను అనండి.

బా—వస్తాను. నిశిరాత్రి.

న—వందనం. నాకు సెలవు.

బా—నళినికా, నీ ఉపకారం నేను మరవలేను.

న—అది మీ యిష్టంగాని, రావడం సంగతి మాత్ర మరిచిపోకండి.

బా—తన రోగానికి ఒకే ఒక అమోఘ ఔషధం ఉందని తెలిసింతరవాత అదొక్కటీ చెడనాడుకునే రోగి ఉంటాడా !

న—నమస్కారం. (అని, కు. మ. కి వెళ్ళిపోతుంది.)

[నళినిక నిష్క్రమించడం చూస్తూ కు. ఎ. నించి సంతుష్టుడు ప్రవేశిస్తాడు]

బా—(కు. ఎ. నించి వచ్చే సంతుష్టుణ్ణి చేతులు పట్టు గుంటూ) ఇదుగో సంతుష్టుడూ! ఈ ఊరెప్పు డొచ్చావ్, మిత్రమా!

సం—ఈమధ్యే.

బా—క్షేమమా?

సం—ఆ. మాట్లాడదాం గాని, ఇప్పు డిల్లా వెళ్ళింది ఎవత్తె?

బా—యువరాణికి దాసి.

సం—ఏంపని దాని కిక్కడా?

బా—యువరాణి నన్ను రమ్మంటోందని రాయబారం తెచ్చింది.

సం—నా కిక్కడికి రాకపూర్వమే తెలుసు. యువరాణి కేం? రమ్మంటుంది. వెడితే ప్రాణంమీదికి వచ్చేది నీకూ!

బా—ఈ అర్ధరాత్రికే వెడుతున్నాను.

సం—ఎల్లా వెడతావయ్యా లోపలికీ? వెడితే బోనులో చిక్కడ్డట్టు చిక్కడతావు. మంచి ఖైదులో కూచోవాలి పెళ్ళికూతురులాగ. అక్కడ మంత్రులు చండశాసనులు. అట్టే సాహసం చెయ్యకు.

బా—పిరికిపాలు పొయ్యకు మిత్రమా! ఈ చేత్తో చాలా దెబ్బలాటలు కానిచ్చాను. అమాయికంగా వచ్చి పిల్లల్ని

ఎత్తుగు పోతూండే రాక్షసిని హతమార్చావు, చిన్నప్పుడు—జ్ఞాపకం ఉందా?

సం—లేకేం? అప్పుడేగా నీకు బాలకేసరి అనే బిరుదు వస్తా! అది అసాధారణపు పనే! కాదనడం ఎల్లా? కాని. పరాయి గృహంలో నిశిరాత్రి ప్రవేశించడం కొంచెం పీకల మీదికి వచ్చే వ్యాపారమేమో!

బా—ఏమైనాసరే, నేను రాత్రి అంతఃపురంలోకి వెళ్ళి తీరాలి.

సం—అటువంటప్పుడు నిన్నొక్కణ్ణి వెళ్ళనిస్తానా? నేనూ నీతో వస్తాను. పని మంచిదయితేం చెడ్డదయితేం, మగోడు తోడుంటేనే మంచిది.

బా—వల్లకాదు వల్లకాదు, నేను ఒంటరిగానే వెళ్ళాలి. ఇల్లాంటి వ్యాపారాల్లో పరాయి యింటికి ఒంటరిగానే వెళ్ళాలి, సంప్రదింపు వ్యాపారాల్లో రెండోవా డుండాలి, యుద్ధవ్యాపారాల్లో చాలామంది ఉండాలి. భయపడకు. రాజుగారి భటులు మరీ ధైర్యవంతులు కారు. పైసాచూపిస్తే అంతఃపురంలో అద్భుతాలు జరుగుతాయి. నేను కుస్తీ వచ్చిన వాణ్ణేగా! అది సరేకాని, ఈ బస ఎట్లా తెలిసింది నీకూ?

సం—ఒకదాసీపిల్ల ఒకచోట సంతర్పణ ఉండనేవార్త నాతో చెప్పి నా ఉంగరం మీది చెక్కడం చూస్తానని పుచ్చుగుని తుర్రుమంది. ఈ నేరం బాలకేసరితో ఫిర్యాదు

చెయ్యాలి, వానిల్లెక్కడ చెప్పండిబాబూ అంటూ వాకబు చేసుగుంటూ ఇక్కడికి వచ్చాను.

బా—మేం ఈ ఊళ్ళో ఉన్నట్టు నీ కెట్లా తెలుసూ ?

సం—నోట్టో నాలికుంటే అన్నీ తెలుస్తాయి.

బా—అధికారులవల్లా ?

సం—అబ్బే! వాళ్ళల్లో ఎవరేనా నోరుమెదిపితే ఉరి తీస్తాం అని శాసనం ట.

బా—మరి ?

సం—ఆ పెద్దపులి చంపబోయిన అబ్బాయినే కలుసుకున్నాను.

బా—ఉండుండు. పెద్దపులి ఏమిటి ?

సం—అయితే. నీ మాట చెప్పు, ముందు. నువ్వెందుకు వచ్చేసినట్టు, ఇక్కడికి, మిత్రమా ?

బా—నన్నూ అమ్మనీ నాన్నగారు రమ్మన్నారు, వచ్చేశాం.

సం—ఈ నలుపురంగు ఎట్లా వచ్చింది ?

బా—ఏవో మాత్రలు మింగించారు, మాచేత! సరేగాని, పెద్దపులి ఏమిటి ?

సం—చెబుతాగాని, ఎక్కడా తెలియనీకు, మన్నికుడా ఉరితియ్యగలరు. చండభార్గవుడనే, ఋషియొక్క శిష్యుల్లో కాశ్యపుడు ఒకడు. కాశ్యపుడిమీద ఒకసారి ఒక పులి దూకింది. కాని, అది అతణ్ణి చంపేసేలోపల దాన్ని బెదర

కొట్టేశారు. ఋషి మీ నాన్నగారిని కలుసుకుని ప్రశాం తంగా జీవించే ప్రజల్ని రంజింపలేని రాజు ఉండేం లేకేం అన్నాడు. మీ నాన్నగారికి కోపంవచ్చింది. పైకి కాషా యాలు ధరించి లోపల చండాలత్వం గల ఋషి ఉండేం లేకేం అన్నాడు. కోపాలు పెరిగాయి. స్వశక్తివల్ల ఋషి తన శిష్యుణ్ణి లేవదీశాడు. కోపంచంపుగున్నాడు మనసా ఊహించుగోలేని పశుప్రాయుడికి శరీరతః అనుభవం తప్ప దన్నాడు. చండాలుల్తో జీవిస్తేగాని మీ నాన్నకి జ్ఞానోదయం కాదన్నాడు.

బా—చాలాజరిగిందే! మానాన్న ఏమీ చెప్పలేదే, మాతో!

సం—సరిసరి. కొంపముంచి ఇదంతా నీకు తెలిసినట్టు వారి దగ్గిర తేలిపోయేవు గనక! జాగర్త!—అప్పుడు మీ నాన్నగారికి పశ్చాత్తాపంవచ్చి, తను ఒక సంవత్సరం చండాల జీవనం చేస్తానన్నాడు. కాని, ఎట్లా వీలౌతుందని అడిగాడు. ఒక వనమూలిక యిచ్చి, అది సేవిస్తే వర్ణం మారుతుందని ఋషి చెప్పి విరుగుడు కుడా సూచించాడు.

బా—మరి మానాన్నగారు ఒక్కరూ రాక, నన్నూ అమ్మనీకుడా రమ్మన్నారే!

సం—అనుమానం తగ్గించుగోడానికేమో. లేక, అల వాళ్లకి భంగం రాకుండా ఉండడానికో! కాని, మొదట్లోనే అడగాలనుకున్నాను—వాళ్ళేరీ?

బా—ఇది నామకః మా బసగాని, అమ్మా నాన్నా కూడా హృదయపూర్వకంగా ఆ హీనుల్తోటే జీవిస్తూ వాళ్ళ కష్ట నిష్ఠూరాల్యాలు తెలుసుకుంటూ ఉన్నారు. చాలా చీకటి పడితేగాని ఇంటికి రా నేరారు.

సం—సరే. నేను మళ్లీ ఎప్పుడు రానూ?

బా—నువ్వు మన ఊరెళ్ళిపోవూ?

సం—ఇక్కడే ఉంటాను.

బా—ఎందుకోసం వచ్చి ఉన్నావంటే?

సం—చదువు పూర్తి చేసుగోడానికంటాను. సరే, రాత్రి వెళ్ళడమేనా?

బా—ఓ.

సం—అయితే. నాతో రా. వేళ అయేదాకా కలిసి ఎక్కడో కూర్చుందాం. సంధ్యపడుతోంది.

బా—స్నానంచేసి, పూజకానిచ్చి, రహస్యంగా వస్తాను. అస్తమయం ఎంత సుందరమో చూడు. తూర్పు నలు పెక్కింది, పడమర జేగురైంది, మధ్యాకాశం రెండు సహోలు ఏకమైనట్టు శివుడియొక్క అర్ధనారీశ్వరత్వమూ వ్యోమకేశిత్వమూ స్ఫురణకి తెస్తోంది. ప్రకృతి అద్భుతంగా మారింది. తెల్లచీర విడిచేసి చుక్కల నీలిచీర ధరించింది. వేడిగాళుపులు ఉపసంహరించుగుని మనోహర పవనాలు వీస్తోంది. వర్తకులకీ కార్మికులకీ కాలం అయిపోయింది, కాములకీ తస్కరులకీ కాలం అవుతోంది. ఆహా! సంతుష్టా,

ఈ పాత ప్రపంచమే ఇప్పుడు ఎంత కొత్తగా కనపడు తోంది!

సం—నీమూలాన్నే!

(అని, సంతుష్టుడు కు. ఎ. కి పోతూండగా, తెర)

---

## రంగం-3

[రెండో తెర ఎదట. కు. ఎ. నించి ముందు బాలకేసరి, అతని వెనకాల సంతుష్టుడూ ప్రవేశిస్తారు. బాలకేసరి నల్లముసుగుతో దొంగలా కనిపించాలి, చుట్టచుట్టి ఎడమభుజానికి పెద్దతారు ఉంటుంది. కుడిచేతులో కత్తి ఉంటుంది. సంతుష్టుడి చేతులో కర్ర ఉంటుంది]

బా—ఔరా! యవ్వనం ఎంత విచిత్రం! అంతా ఉద్రేకమే, అంతా నిర్లక్ష్యమే! యవ్వనం ప్రమాదాల్ని లెక్క చెయ్యని దురుసు! యవ్వనం బుద్ధిని బంధించేస్తుంది. యవ్వనానికి శాసనం అంటే బలాదూరు. అయినాసరే, యవ్వనం చాలా వినోదకరం.

సం—మిత్రమా!

బా—సంతుష్టా! నిన్ను వెళ్ళిపొమ్మని చెప్పినా, నా వెనకాలే వస్తున్నావే!

సం—ఈ చీకటి ఎంత భయంకరమో చూడు. నిద్రాదేవి సకల ప్రాణుల్నీ తనలో మాయంచేసుగుంది—తల్లి

శిశువుని తన కడుపులో పెట్టుగున్నట్టు. సౌధాలన్నీ సమాధిలో ఉండిపోయాయి. ముట్టుగున్న తరవాతగాని ఇది చెట్టు అని తెలియడంలేదు. సర్వాన్నీ చీకటి కబళించింది. చీకటి లోకంలో నదీప్రవాహాలులాగ వీధులూ, మెట్టలులాగ ఇళ్లూ ఉన్నాయి. ఏదిక్కు ఏదో తెలుసుగోడానికి దిక్కులేదు. తూర్పు పడమర ఉత్తర దక్షిణాలకి అర్థం నశించింది. ఈ చీకటి ఈదడానికి వీలైనంత సాంద్రతగల సముద్రంలా ఉంది.

బా—అయినా సరే, మిత్రమా! నన్ను వదులు. వెళ్లు, నామీద ఒట్టు.

స—మిత్రమా! స్నేహం చొప్పునే ఇప్పటిదాకా నీకు బాధకలిగించాను. మరి వెడతాను. (అని, కు. ఎ. కి వెడతాడు.)

బా—(వినడం నటించి) అదుగో ఏదోగానం. జంత్రగాత్రాలు వినిపిస్తున్నాయి. ఎవడో అదృష్టవంతుడు తన ప్రేయసితో ఆనందంగా కాలం పుచ్చుతున్నాడు. బయటికి కూడా ఇంత స్ఫుటంగా వినపడుతోంది గనక, ఆ జంత్రాన్ని పలికిస్తూన్నది పురుషుడే. కాని, ఆ గాత్రంయొక్క కోమలత్వం గమనిస్తే ఆ పాడేది స్త్రీయే, పైగా తాళం సూచించే దెబ్బలలో గాజుల చప్పుడు కూడా వినపడుతోంది. (మరొకవైపు చూడడం నటించి) అదుగో, మరొక జంట! ఆ స్త్రీ మొహం నిండా కోపం కళ్ళనిండా నీళ్ళూ ధరించి, 'మీకు

నే నెందుకూ, అని ప్రియుణ్ణి ఈసడిస్తూ, ఆ కంగారులో తను చెప్పదలిచిన ఇష్ట విషయాలకి విరుద్ధంగా ఉండే మాటలు అనేస్తోంది. (వినడం నటించి) అరె! గుడ్లగూబ కూసింది. ఆవిడ హడిలిపోయి ఆయన ఒళ్ళో చేరింది. కూత భయంకరమైన కూతే గాని. ఆవిడికి భయం వెయ్యడంవల్ల అతడికి కొంత లాభించింది. అయ్యో! ఊళ్ళోవాళ్ళ గొడవలు నా కెందుకూ? నా పనిమీద నే పోతాను. (అని మరో వైపు చూసి) అడుగో! ఒకడు ఆ గుమ్మం దగ్గిర నుంచున్నాడు. పాపం! వస్తానని మాట యిచ్చాడు గావును. కాని, తలుపు కొట్టడానికి తటపటాయిస్తున్నాడు. (వేరే ఒక వైపు పరికిస్తూ) అడుగో! బెదురుతూ, దిక్కులు చూసుగుంటూ, వెలుగులోంచి తప్పుగుంటూ ఎవడో వెడుతున్నాడు—తస్కరుడై ఉంటాడు. తుంటరి! పోయాడు. బాబో! ఈ వేపునించి గస్తీవాడు లాంతరు పుచ్చుగుని వస్తున్నాడు. కూడలి దగ్గిరికి వెళ్ళి దాక్కుంటాను. ఎంత దశ పట్టిందీ! నా పిరికి ఆలోచన్లకేసి చూసి నా కత్తి నవ్వుతోంది. నా ప్రేయసిని చూడ్డానికి వెడుతున్నాను గాని, మరేమీ దొంగతనానికి వెళ్ళడం లేదు నేను. అయినా, ప్రేమకోసం వెడితేం, ధనంగురించి వెడితేం, ఉద్రేకం మూలాన్ని వెడితేం స్వశక్తిమీద ఆధారపడాలి గాని, ఇతరులమీద కాదు. నిశివేళ ఇల్లా తిరుగుతూ మనోహర దృశ్యాలు చూడడం సంతోష దాయకమైనా చాలా

ప్రాణాపాయకరం. (ఎ. ఎ. కి జరిగి, పైకిచూసి, తాడు తీస్తూ) మరి యత్నం చేస్తాను. ఫలించకపోతే తప్పు మనది కాదు గదా! ఇదే ప్రాకారం. తాడు విసురుతాను. దైవ కృప ఉంటే, మాయమంత్రం పట్టిస్తే, శివుడిఆజ్ఞ అయితే, చీకటి యింకా దళసరిఅయి జనం యొక్క నిద్ర యింకా గాఢంఅయి నా అదృష్టం పండితే, నాకు విజయం కలగాలి, ఈతాడు పైనున్న దేనికేనా పట్టుగోవాలి! ఇప్పుడు నన్ను అడ్డినవాడికి మరణమే. (అని, తాడు విసురుతాడు. అది పట్టుగుంటుంది). అమ్మ! ఈ తాడుపైన పట్టుగుంది. వీరుడు యత్నించి సత్తాచూపించాలి, రాతనిబట్టి విజయం ఉంటుంది. ఇది పట్టుగుని పైకిపోతాను. ఈతాడే నన్ను ఉద్ధరించాలి.

[అని, ఎడమకి నిష్క్రమించగా, రెండో తెర లేవాలి. కురంగి పడుకుని ఉంటుంది. ఎ. వె. నించి నళినిక వస్తుంది].

న—(ఎ. వె. నించి వస్తూ) ప్రియుడు రాగలవార్త నేను చెవిని వేశానో లేదో యువరాణికి మనస్సు ఉప్పొంగిపోయి కళ్ళు మూతపడి పోయాయి. ఈ మధ్య కంటిమీద కును కేనా ఎరక్కపోబట్టి, ఆ పడక పడక మళ్ళీ లేవలేదు. ఏక పలవరింతలు. నేను అన్నానికి వెళ్ళేటప్పుడు ఇక్కడ మా గధికని ఉంచి వెళ్ళాను. తన రహస్యం దానికి ఎక్కడ తెలిసిపోతుందో అని ఈవిడికి నిద్దట్లోకుడా భయమే, అందు కని పలవరింతల్లోకుడా సమర్థించుకోడానికి యత్నమే.

మాగధికని పంపించేసి, మళ్ళీ నేనే తన దగ్గిరికి వచ్చిన సంగతికూడా ఈవిడికి తెలియదు.

కు—(పలవరిస్తూ) ఆయన వచ్చాడా ?

న—(గొంతికమార్చి) ఎవరూ ? మంత్రిగారా ?

కు—కాదు కాదు ! ఆయనా ?

న—అంటే !

కు—(తప్పించుగోవాలన్నట్టు యత్నిస్తూ) ఆఁ, ఆచిలక్కి పంజరంచేసి తెమ్మన్నానే—ఆయనా !

న—సరే. చిలక్కిపంజరం ఇదివరకే తెచ్చి యిచ్చాడాయన.

కు—అదిసరి. నాకు తెలుసు ఆమాత్రం. మరోటిచేసి తెమ్మన్నాన్లే, నుష్వేరగవ్ !

న—(ఎంత గడసరివమ్మా అన్నట్టు కనుబొమలెత్తి కళ్ళుపెద్దచేసి నోరుతెరిచి తల ఊపుతూ) ఆయనా ? ఆయన వచ్చేవేళ అయింది. ఆయన్ని ఒప్పించే సరికి తలప్రాణం తోకొచ్చింది. పాపం, ప్రాకారం ఎక్కడానికి ఏం బాధ పడుతున్నాడో ! (అని, కు. మ. కేసి చూసి) అమ్మబాబో ! ఎవడో దొంగాడు ! దొరగారికోసం తలుపులుతీసి అట్టే పెడితే దొంగాడు ప్రవేశించాడన్నట్టొచ్చింది. వీడు తలుపులన్నీ మూసేసి వస్తున్నాడేమో. అల్లా జరిగుంటే రావలిసినాయన రానేలేదు కుడానూ ! ఇప్పుడుగాని నేను కేకవేస్తే

నాకూ యువరాణికీకూడా ప్రమాదం. ఇక్కడ పడుకుని, ముసుగుపెట్టుగుని, గుర్రుకొడతాను. (అని, అట్లాచేస్తుంది).

బా—(కు. మ. నించి వచ్చి, ఇటూ అటూ చూసి) నళినికని మెల్లిగా తన్నుతాడు).

న—(గుర్రుమానేసి ఇంకా ముణుచుగు పడుకునే ఉంటుంది)

బా—(దుప్పటీ తీసేసి, కంఠందగ్గిర కత్తిమొన పెడతాడు).

న—(భయపడిలేచి, నుంచుని, కళ్ళు చేత్తోమూసుగుంటుంది).

బా—(మెల్లిగా) ఏయ్. నళినికా, చూడు, నేనే!

న—(చూస్తూ) చంపేశారు, బాబూ! మీరేనా! ఇదేం వేషం స్వామీ?

బా—ప్రాకారం దాకా ఈ వేషంలో ఎల్లానూ రావలిసొచ్చింది. తరవాత ఈ వేషం సంగతి నాకు జ్ఞాపకమే లేదు, నేనే కదా అంతఃపురంలో జొరపడుతూన్నది, అనుకున్నాను. మనం మరొకలా ఉండడం ఎకటివాళ్ళకి గదా మొకట తట్టడం!

న—యువరాణిగారిని లేపనా?

బా—వద్దు వద్దు. నిద్రపోనీ పాపం! ఆమె లేచేవరకూ నేను చూస్తూ కూర్చుంటాను, తనివి తీరుతుందేమో!

న—పోనీ, ఇల్లా దగ్గిరిగా రండి.

బా—అబ్బే వద్దు. నాగుండా చప్పుడుకి కురంగి నిద్ర చెడిపోవచ్చు.

న—అసలు మీరింకా కంగారుగానే ఉన్నట్టున్నారు.

బా—లేను. కోరిక ముందుకి తరుముతూ ఉన్నా, మనస్సు ఆనందంతో మూర్ఛపోయింది.

కు—(నిద్రలో) నళినికా!

న—అమ్మా! (అని, వెళ్ళి కాళ్ళు ఒత్తుతుంది)

కు—ఇంకా రాలేదా?

న—నేను ఇందాకానే వచ్చేశాను.

కు—నా కాళ్ళు ఒత్తుతూన్నది నువ్వేనా?

న—(అక్కడికి రమ్మని బాలకేసరికి సంజ్ఞ చేస్తూ) మరి ఎవరూ?

కు—(లేచి కూచుని కళ్ళు నులుము కుంటూ) ఎంత రాత్రయిందీ?

న—నిశిరాత్రి.

కు—ఆ నిశాచరుడు ఏమన్నాడూ? నాకు మతిపోయే టట్టుంది. మరి రాలేదే అన్నప్రకారం! ఇల్లారా నాబళ్ళోకీ, భయం వేస్తోందీ!

న—(తను ఎడంగా తప్పుగుని వెళ్ళు అన్నట్టు బాల కేసరికి సంజ్ఞ చేస్తుంది.)

బా—(వెళ్ళి కురంగిని పట్టుగుంటాడు.)

కు—(పూర్తిగా కళ్ళు విప్పిచూసి, కంగారు పడిపోయి, లేచి) ఇది నా కోరికలకి పరమావధే కాని, నా బాధలకి ప్రారంభం! ఇక్కణ్ణించి నన్ను ఎవరూ నమ్మరు.

బా—నీకు బాధకలిగించడానికి నేను బాధపడి వస్తానా, యువరాణీ! నేను నీ పిలుపు చొప్పున వచ్చిన అతిథిని. నన్ను నువ్వు పరాయివాణ్ణిగా చూస్తే నేను తక్షణం పోతాను. మన హృదయాలకి ఇదివరకే వివాహం అయింది గదా అని తెగించి వచ్చాను. తుపానులో తీగెలాగ వణికి పోతున్నావే!

న—యువరాణీ! మీ రింకా యిది స్వప్నం అనుకుం టున్నారు గావును. లేక, నిద్దరమత్తు యింకా వదల్లేదో! కొంచెం నిదానించండి. బాబూ! నాకు నిద్దర కూరు కొస్తోంది. ఇప్పుడే వస్తాను. (అని కు. వె. కి వెడుతుంది.)

బా—కురంగీ! చెయ్యి ఇల్లా తే.

కు—(కుడిచెయ్యి ఇస్తూ) గ్రహించగలవారికి చెప్పక్క ర్లేదు.

బా—(కురంగి చెయ్యి పట్టుగుని) యువరాణీ! దీనిపేరే పాణిగ్రహణం! (నడిపిస్తూ) ఇల్లా ఏడడుగులు వెయ్యి. దీంతో మనకి యథావిగా వివాహం జరిగినట్టే.

కు—రెండోసారి నన్ను రక్షించడానికి, మీ ప్రాణం తెగించి నాకోసం ఇక్కడికి వచ్చారు గనక, నేను ఎన్ని కష్టాలైనా సంతోషంతో భరించి, మీకోసం జీవిస్తాను,

మీకోసమే మరణిస్తాను. నా హృదయంలో మీరు తప్ప ఇతరం ఏమీ లేదు.

(అత డామె చెయ్యిపట్టుగుని, ఎ. మ. కి తీసుగుని వెడుతూండగా—తెర)

---

## రంగం-4

[రెండవ తెర ఎదట. మాసిన గడ్డంతో, చిరిగిపోయిన బట్టలలో చిక్కిపోయిన శరీరంతో, బాలకేసరి చాలా దురవస్థలో ఉన్నట్టు కనిపిస్తూ కు. ఎ. నించి ప్రవేశిస్తాడు]

బా—రహస్యం ఎల్లకాలమూ దాగుతుందా ? సందేహించి, కాపలావేసి పట్టెయ్యడానికి యత్నించారు. యువరాణి అంతఃపురంలోంచి బయటపడేసరికి చావుతప్పి కన్ను లొట్టపోయింది. ఇవతల పడ్డది నా శరీరం మాత్రమే, నా మనస్సు అక్కడే చిక్కడింది. కాని, యువరాణికి ఎంత దురవస్థ తెచ్చిపెట్టానూ ! ఎల్లాంటి దుస్థితిలో ఆమెని వదిలి రావలి సొచ్చిందీ ! యువరాణీని దాసీలు హేళన చేశారు, రాజు ఖైదులో ఉంపించారు. ఆమె కన్నీళ్ళు కాలవలైనాయి. అటువంటి సమయంలో కుడా ఆమె ఆలోచన నాక్షేమం గురించే, నేను భద్రంగా ఎట్లాబయటపడతానా, అనే! నేను ఎంత పాపినీ కాకపోతే అంత అమాయిక

ప్రేయసి నించి దూరం కావడమేమిటి, ఇంకా బతికి ఉండడమేమిటీ !

ప్రేమాగ్ని నా హృదయాన్ని వేచింది. నా శరీరాన్ని అగ్నికి అర్పించెయ్యాలని చూశాను. తీరా, అగ్ని రగిలించి చూస్తినిగదా, నా చేతికి అగ్ని చల్లగా ఉంది, లాభం లేక పోయింది. ఒకసారి ఎండ తీక్ష్ణంగా ఉంది, భూమి కాగి పోయింది, జ్వరం వస్తే కాగినట్టు. భూమికి గల తడి సూర్యుడు హరించాడు. కార్చిచ్చు జీర్ణించడం వల్ల చెట్లు మోక్షైశయలో పడ్డాయి పర్వతాలు నోళ్ళవంటి గుహలు తెరుచుగుని నీటిచుక్కకోసం పరితపించాయి. భూమి స్పృహ తప్పిపోయింది, గాలి కాలిపోయింది, ఇసుక మాడిపోయింది. అయితేం, అంత వేడికుడా నా శరీరాన్ని ఏమీ చెయ్యలేక పోయింది. అగ్ని కాల్చలేకపోయిన నా శరీరాన్ని ఎండ తప్తం చెయ్యగలదా ! అదీ లాభించలేదు. మరణ తుల్యమైన ఈ జీవితం ఇక నేనెందుకూ జీవించడం ? నీటిలోపడి ప్రాణత్యాగం చేస్తే, పోనీ ! కాని, జలంలో ఆత్మహత్య కూడ దంటారు. ఇక ఒక్కటే మార్గం ఉంది. (ఎ. ఎ. కి సూచిస్తూ) ఆ కనిపించే మెట్ట ఎక్కి కిందికి దూకేస్తాను !

కొన్ని నెలలు అంతఃపురంలో గడిచాయి, కొన్ని దినాల కిందట, ఈ అడివిలో పడ్డాను. మా సంవత్సర అజ్ఞాతవాస కాలం పూర్తి అయిందేమో ! కాని, లాభం ఏమిటీ ? మామూలు మనిషిని కావడానికి విరుగుడు నాన్నగారికే

తెలుసును. ఆయనా, అమ్మా ఎక్కడున్నారో! వైరస్త్యనగరంలో చండాల వాటికలో చేరిన కొద్ది దినాల్లోనే నేను మాయం అయినాను. నన్ను గతించిన వాణ్ణిగానే కట్టుగుంటారు వాళ్ళు. వాళ్ళకే కాక, యువరాణికికుడా శోకం తెచ్చిపెట్టిన వాణ్ణయాను. పాపం ఆ సంతుష్టుడికి ఎంతబాధ కలిగించానో! ఆ రాత్రి అతణ్ణి నేను పొమ్మన్నప్పుడు అతడు ఎంత దుఃఖించాడో! అతడు నా కూడాఉంటే! అయ్యో, అంత భాగ్యమే నాకుండిఉంటే, ఈ గతి నా కెందుకు పడుతుంది! (కు. ఎ. నించి ఏదో వింటూన్నట్టు నటించి) ఇది స్వప్నమా మెలుకువా? ఎవరో నన్ను పేరెట్టి 'విష్ణుసేనా' అని పిలుస్తున్నారే! సంతష్టుడై ఉంటాడా? అదెట్లా సంభవం? నా చిత్తం వచ్చిన దార్ని నేనుకాగా, సంతుష్టుడు నన్నెల్లా వెంటాడ గలడూ?... ఆఁ ఆఁ నిజమే నిజమే! సంతుష్టుడే! ఇతడు నేను బతక డానికి ఏదో సంజీవి తెస్తున్నాడేమో!

సం—(కు. ఎ. నించి గబగబా వచ్చి, ఆయాసంతో బాలకేసరిని కౌగిలించుగుంటూ) మిత్రమా!

బా—మిత్రమా!

సం—ఏమిటి ఈ వాలకం?

బా—చివరి వాలకం. ఆ గుట్టఎక్కి పడిపోడానికి నిశ్చయం చేసేసుగున్నాను.

సం—నన్ను వదిలేస్తావా?

బా—ఓ. నువ్వు జీవించాలి, సజ్జనుడవే.

సం—కురంగిని వదిలేసి పోతావా ?

బా—తనవాళ్ళా పైవాళ్ళా క్షోభలు పడలేక, కురంగి ఈ పాటికే, మరణించే ఉంటుంది. నేను బతికి ఉంటే కురంగిని ఎట్లా కలియడం ? చచ్చి ఆమెని కలిసి జీవిస్తాను.

సం—అయ్యో ! కురంగిని అంత బాధ పెడుతున్నారా ? అయితే మనం తొందరపడాలి.

బా—దేన్ని గురించి తొందర పడాలంటావ్ ?

సం—మనం కురంగి అంతఃపురంలో వాలాలి.

బా—నీకు వెనకట్లో ఉంటూండే మతి ఇటీవల పోయి ఉండాలి, మన మొహాలేమిటి, కురంగి అంతఃపురంలోకి మళ్ళీ వెళ్ళడం ఏమిటి !

సం—మిత్రమా ! ఇన్నాళ్ళూ నేను నిద్రపోలేదు.

బా—నా అంతరాత్మ అట్లానే అంటూంది, సంతుష్టా ! స్నేహం అనేక జన్మల బాంధవ్యం.

సం—మనం అదృశ్యులం కాగల సాధనం సంపాదించాను.

బా—నీ స్నేహం ఎంత పవిత్రం, ఎంత దివ్యం ! సంతుష్టా, చెప్పు చెప్పు.

సం—కాశ్యపుణ్ణి కలిశాను. అతనికి శుశ్రూష చేశాను. వర్ణ పరివర్తనానికీ శరీర అదృశ్యత్వానికీ మందులూ విదు

5

గుళ్ఖా అతడి దగ్గిర నేర్చాను. మనం అదృశ్యులం అయి అంతఃపురంలో ప్రవేశించవచ్చు.

బా—మహానుభావా! నీ శిష్యుణ్ణి, నన్ను శాసించు.

సం—అయితే, నన్ను నమ్మి, నాతో, రా. ఆత్మహత్య మాట మానెయ్.

బా—చిత్తం, గురుదేవా!

[సంతుష్టుడు ఎ. ఎ. కి నడవగా, వెనకాల బాలకేసరి వెడతాడు. రెండవతెర లేస్తుంది. కురంగి గది. వెనకగా, ఒక పక్క ఉంటుంది. కృశించిన శరీరంతో అలంకారం లేకుండా కురంగి కనిపించి, తోచనట్టు తిరుగుతూ ఉంటుంది.]

కు—సువాసనపువ్వులంటే నాకు పరమద్వేషం పుట్టింది. నాస్థితి గ్రహించాలని నెమిళ్ళు తంటాలు పడుతున్నాయి. చిలకల పలుకులకీ మైనాల పిలుపులకీ అంతం లేదు కాని, అవంటే నాకు తల నెప్పెడుతోంది. నా దాసీలు నన్ను యాగీ చేస్తూనే ఉన్నారు. నా మనోహరుడు ఏమయాడో! నాన్నగారు తమ పట్టు విడవరు. అమ్మగారు తన పట్టు విడవదు. నా పట్టు నెరవేర లేదు. మరి నేను జీవించడం అనవసరం. జీవించి ఉంటే ఇంకా ఎటువంటి బాధలు పడాలో! నళినికా!

న—(ఎ. మ. నించి వస్తూ) అమ్మా!

కు—నువ్వు లేనప్పుడు మీ అమ్మ పంపగా, మాగధిక వచ్చి నా తలనెప్పికి మందు తెచ్చిపెట్టి వెళ్ళింది. నువ్వు అమ్మగారి దగ్గిరికి వెళ్ళి నా తలనొప్పి చాలాభాగం తగ్గిపోయిం

దనిన్నీ, కాన్సేపట్లో అస లింకేమీ ఉండదనిన్నీ చెప్పేరా. స్నాన పరికరాలు తీసుకురా.

స—చిత్తం. ఇప్పుడే వస్తాను. మీరు (కు. వె. సూచిస్తూ) అల్లా నడిచి-మెరిసి నప్పుడే మేఘాలు చిత్రంగా కనిపిస్తాయి, చూస్తూ ఉండండి. (అని, కు. ప్ర. కి వెడు తుంది.)

(బాలకేసరి, సంపత్తులు ప. ఎ. కి వచ్చి అప్పుడే వెనక్కి పోతారు.)

కు—(కు. వె. కేసి కూచుని కొంగుతో ఉరిపోసుగోడం అభినయిస్తూ) ప్రాణేశ్వరా! నిన్ను చేరడానికే వస్తున్నాను. (అని ఉరి యత్నంలో ఉంటుంది.)

సం—మిత్రమా! నువ్వు నీ చక్కదనం గురించి కోస్తూంటావు. నీచక్కదనం యావత్తూ ఈ అమ్మాయి చక్కదనాన్ని దిగదుడవడానికేనా పనికిరాదు. ఈ సౌందర్యం సహజం. నీకోసం సగం అయిన అర్ధాంగి, అయినా చంద్రరేఖలా మనోహరంగా ఉంది.

బా—పుస్తకాల్లోని మాటలు దొర్లించేస్తున్నావు.

సం—నువ్వు నన్ను ఎరుగుదువు గనక నన్ను తేలిక చేస్తున్నావు. నన్నెరిగుండని వాళ్ళు ఈమాటలకే నన్ను మెచ్చి ఉండేవాళ్ళు. తలుపు గడియవేసి వస్తాను.

(అని కు. ఎ. కి వెళ్ళి అప్పుడే వస్తాడు. ఒక ఉరుం వినిపిస్తుంది.)

కు—(హడిలిపోయి) బాబో! రక్షించండి, రక్షించండి.

బా—(వెళ్ళి) ప్రేయసీ, భయపడకు, నే నున్నానుగా!

కు—ఏమాశ్చర్యం! మీారా! ఇది నిజమేనా? నాకు తెలియడం లేదు.

బా—ఏమీా భయంలేదు. (అని చేతులు పట్టుగుని, లేవ దీస్తాడు.)

కు—పరమాశ్చర్యం! నా బాధ యావత్తూ తొలిగి పోయింది. (అని, కళ్ళనీళ్ళు పెట్టుగుంటుంది.)

బా—చాలా సంతోషం. (అని, సానందంగా విచా రిస్తాడు.)

సం—ఇదేమిటీ? ఇద్దరూ కూడా ఏడవడం మొదలెట్టారే, చెరో ఏడవడమూనూ! నాకు ఏడుపు రాదన్న మాటగాని, నేనూ పోసీ అని చెప్పి ఏడ్చి ఉందును. వెనక మానాన్న పోయినప్పుడూ అంతే. ఏడవాలని తెగ గోలెట్టి పోయాను. కాని, కంట్లోకి ఒక్క చుక్కైనా రాలేదు. స్వవిషయంలోనే నా ఏడుపు అల్లా వట్టిపోయి నప్పుడు ఇతర దుఃఖాల గురించి అక్కర కొస్తుందా! అల్లాటి ఆశా లేశం కూడా నాకు లేదు.

బా—హేళన చెయ్యకు మిత్రమా! యథార్థప్రేమకి మాయ తెలియదు. కనక, ఏడుపువస్తుంది. జ్ఞాని అయేది, మూర్ఖుడయేది గడ్డుసమయాలల్లో శరీరవిషయంలో తేడా లుండవ్, మనస్సు విషయంలో ఉండవచ్చుగాని.

సం—క్షమించు మిత్రమా! అటువంటి సమయం నాకు వచ్చినప్పుడు గమనించి, అప్పుడు చెబుతాను, నీతో!

బా—కోపం వచ్చిందా ?

సం—ఏజన్మలోనూ రాదు. వచ్చినా, స్నేహితుడి కోపం అంటే మరీ తీవ్రమైన ప్రేమ అన్నమాట! సరే కాని, ఎవరో తలుపు కొడుతున్నారు.

కు—నళినిక అయి ఉంటుంది. నేను ఈ పాటికి ఏదో దారుణం చేశానని ఆమె బాధపడుతూంటుంది.

బా—తలుపుతీసి రా మిత్రమా!

సం—తీసి వస్తాను గాని, మీరిద్దరూ, ఒక్కరవ్వ, పక్కకి తప్పుకుని దాక్కోండి.

(బాలకేసరీ, కురంగీ, ఎ. మ. కి తప్పుకుంటారు)

న—(కు. ఎ. నించి ఏడుస్తూ వస్తూ) అయ్యో! నన్ను పంపేసి యువరాణి ఒంటరిగా ఏమి అఘాయిత్యం చేసిందో గదా అని నే నేడుస్తూంటే (అని, కళ్ళు చేత్తో కప్పుకుని) బాబో! చోరులు కూడా లోపల ప్రవేశించారు. ఇక యువ రాణి దక్కదు (అని మోకరించి నేలమీద వాలి ఏడుస్తూ) అయ్యో, యువరాణీ! అయ్యో, యువరాణీ!

సం—(ఎ.మ. సూచించి, వాళ్ళని రమ్మని సంజ్ఞ చేస్తాడు)

కు—(ఎ.మ. నించి వస్తూ) నళినికా!

న—అమ్మా!

కు—భయంలేదు. లే. వచ్చినవారు శ్రీవారే!

బా—(ఎ. మ. నించి వస్తాడు)

న—(లేని ఆశ్చర్యానందాలతో బాలకేసరిని చూసి) స్వామీ, మీరే! ఎంత ఆశ్చర్యం, ఎంత సంతోషం! మీరు

అదృశ్యస్త్రీ లోకంలోనుంచి వచ్చారా, లేక ఆకాశంమీంచి విమానంలో దిగారా? అమ్మో! ఇప్పటికి ప్రాణాలు కుదుట పడ్డాయి. (లేచి, చప్పున, కురంగి దగ్గిరికి వెళ్ళి) స్వామీ! ఎవరూ, ఈ మనిషి?

సం—ఓహో ఓహో! ఎంత విచక్షణ కలదో గదా ఈ ముసలమ్మ! నేను మనిషిననే విషయం స్వయంగా పోల్చుగుని రక్షణ చేస్తోంది. ఇంతవరకు ఎవ్వడూ కుడా నేను మనిషిననే సంగతి అనుమానించనే లేదు. అంతా నన్ను ఒక ముసలమ్మనిగా భావించారు.

బా—నళినికా! నేను నీతో చాలాసార్లు చెప్పలేదూ. నా మిత్రుడు సంతుష్టుడున్నాడనీ! ఆయనా!

కు—ఓ, ఈయనా! ఈ స్వరూపాన్ని నేను భోజన సందర్భాల్లో ఒకటి రెండుసార్లు చూశాను! బాపనయ్య!

సం—అవును. ఎందుచేతా? యజ్ఞోపవీతం ఉంది గనక. అది లాగిపారేసి చింకిరి బట్టలు ధరిస్తే ఒక తాపసోత్తముణ్ణి అయిపోతాను. ఆ చింకిరి బట్టలుకుడా అవతల గిరవాటెడితే జైనమునిగా వెలుస్తాను. సరేగాని, ఏమిటి నీచేతులోవి?

న—స్నానపరికరాలు—యువరాణికి!

సం—ఓసి, ముసలమ్మా స్నానపరికరాలెందుకే ఇప్పుడు యువరాణికి? ఆవిడికిప్పుడు ఆకలి సారేసుగుపోతోంది. (కురంగితో) ఏమండీ, మనకి ఆకలి వెయ్యడంలేదూ? అందుకని, తక్షణం వెళ్ళి తినడానికి తీసుకురా ఏమైనా.

తీసుగొచ్చి వడ్డించు. అప్పుడు చూడు నా ప్రభావం. అగ్ర పీఠం స్వీకరించి—నా సత్తా ఒక్కసారి చూపిస్తారు,

న—అయ్యో సెబాసు, బాపనయ్యా! అనుక్షణమూ తిండి ధ్యానమే! కొంచెం ఉండండి! అసలు, యువరాణిగారి స్వామి ఇంతమందిని కన్ను కప్పి లోపలికి ఎట్లా ప్రవేశించాడో కనుక్కోవాలి.

బా—ఆ కథ మామయ్యా ఆయనే చెప్పాలి.

న—(సంతుష్టుడై చెయ్యిపట్టుకుంటూ) అయితే రండి సామీ పెద్ద సావిట్లోకి—నా స్నేహితులూ నేనూ కూడా వింటాం.

సం—అయ్యో అయ్యో! రండి రండి. వచ్చి అడ్డుపడండి. ఒక అమాయికుడిపట్ల ఘోరమైన అపచారం జరిగిపోతోంది.

బా—వెకిలికేక లెందుకు మిత్రమా! హాస్యాస్పదుడవు అవుతావు.

సం—యువరాణిగారే హాస్యాస్పదురాలైనప్పుడు నేను లెక్ఖేమిటి పోదూ!

బా—యువరాణి హాస్యాస్పదత్వం ఏమిటి?

సం—ఏమిటా! ఉపిపోసుగో జల్పిన వ్యక్తి, తనపని మాసుగోక, కాస్తంత ఉదుం వినపడగానే హడిలిపోయి, రండి రండి రక్షించండి, అంటూ కేక లెట్టడం హాస్యాస్పదం కాదూ?

కు—మహానుభావా! నిజమే. మరొకడు నన్ను రక్షించి ఉంటే, బతికాలో చావాలో నాకే తెలియకపో యుండును. కాని, రక్షించవలిసిన వారే నన్ను రక్షించారు గనక, అవాంతరం తప్పిపోయింది గనక, అప్పటి చర్య నాకు కూడా హాస్యాస్పదంగానే తోస్తోంది, ఇప్పుడు మీా అవహేళనతో! తెలుసుగున్నాను!

న—ప్రార్థిస్తున్నాను, రండీ!

సం—భోజనం ఉంటే వస్తాను. ఇతరుడికి ఎంత అన్నం పెడితే అంత తూనికగల మోక్షమూ ఉత్తరోత్రా మనికి సిద్ధంగా ఉంటుంది.

న—నా నగలన్నీ మీాకిచ్చేస్తాను, రండి.

సం—ఓస్, నీ మాటలేనా నగలు? వెన్న శబ్దం పలికి నంత మాత్రాన్ని పైత్యశాంతి అవుతుందా? కార్యసాను కూలం చెయ్యదల్చినవాళ్ళు, అన్నప్రకారం ఆచరించాలి.

న—(నగలన్నీ తీసి సంతుష్టుడి దోసిట్లో పోస్తుంది).

సం—అయితే, చెబుతాపట్టు.

న—ఇక్కడ కాదు, పెద్దసావిట్లో.

సం—అయితే, యువరాణిగారి సెలవు తీసుగుని వస్తానుండు.

న—అబ్బ, రండీ, వారిసెలవు నేను తీసుగుంటానూ! (అని సంతుష్టుణ్ణి రెక్క పట్టుగుని ఎ. ఎ. కి గబగబా లాక్కుపోతుంది).

బా—నువ్వు గ్రహించావు సంతుష్టుడి ప్రతిభ. కాని, నళినిక ఇంకా అతణ్ణి తేలికగానే కడుతోంది.

కు—కాని, నా ఉద్దేశం వేరు. అదీ గ్రహించింది. ఆయన్ని పూర్తిగా గ్రహించాలని యత్నిస్తోంది.

బా—మరీ మంచిది. ఆయనే మన రక్షకుడు, (అని కు. మ. కి పైకిచూస్తూ) చూడు కురంగీ! ఆ నీలి మేఘం యొక్క అత్యంత సౌందర్యం! ఇల్లాంటి వర్షారంభ సమయ మేఘాలంటే జనానికి ఆప్యాయం. ఈ మేఘాలు ఉరుం మద్దెల విని నాట్యంచేసే నర్తకీ నర్తకులు, వర్ష దేవుడైన ఇంద్రుడి గోవులు, నక్షత్ర సమూహాలకి తెరలు, మెరుపు పాములు ప్రవేశించిన చీమపుట్టలు, వినువీధికి రెండు ప్రక్కలా ఉండే చీకటిపొదలు, పర్వతాల్ని స్నానం చెయించే నీటి కలశలు, సముద్రుడి దగ్గిర ముప్పెత్తి పుష్క లంగా ఆర్జించిన యాచకులు, సూర్యచంద్ర తేజాన్ని ఆపేసే అడ్డు, దేవతల స్నానానికి జల్లులుచిమ్మే పాత్రలు, ప్రేమ బాణాలకి పొదులు! మెరుపువచ్చి చీకటిని చీల్చేసరికి చీకటి ఉఱుముతోంది. దగ్గిరిగా, రా, పోదాం! (అని ఎ. మ. కి తీసికెడతాడు—తెర)

---

## రంగం-5

[రెండో తెర ఎదట. పొదుగాటి సావిడి. సంతుష్టుడు పీఠంమీద కూచుని ఉంటాడు. నళినిక నుంచుంటుంది]

సం—నీ స్నేహితు లంతా వెళ్ళిపోయూరా?

న—ఆ, ఇందాకానే వెళ్ళారు. ఎందుకూ?

సం—ఓ అద్భుతం చెప్పనా?

న—చెప్పండి.

సం—ఇప్పుడు నువ్వెళ్ళి కురంగి గదిలో చూస్తే బాల కేసరి కనిపించడు. స్ఫురద్రూపీ క్షత్రియ వీరుడూ అయిన విష్ణుసేను డుంటాడు.

న—బాల కేసరి ఏమయూరూ?

సం—అతడే విష్ణుసేనుడు.

న—అమ్మ, ఎంత టక్కర్లండీ, మీరూ!

సం—అతడే వర్ణం మార్చుగుని వేషాలేస్తే, నేనా టక్కర్ని? మా బాగా ఉంది నీ తీర్పు.

న—మరి ఆయన తల్లిదండ్రులు?

సం—సుచేతనా సౌవీరరాజూ చండాల వాటికలో ఒక సంవత్సరం గడిపి వాళ్ళ ఊ రెళ్ళిపోయూరు. విష్ణుసేనుడి వయినం వాళ్ళెరగరు.

న—పాపం! పుత్రుడి ఎడబాటు ఎల్లా భరిస్తున్నారో, ఆదంపతులు!

సం—(కొంచెం నవ్వుతాడు)

న—అదేమిటి ?

సం—మళ్ళీ ఎక్కడా అనకు—విష్ణుసేనుడు సుచేతన గారికి పుట్టినవాడు కాడు, అసలు.

న—ఇదేమి టండోయ్, ఉండి ఉండి దారుణమైన సంగతులు విసురుతున్నారే! మీరు చాలా అసాధ్యులు. నమస్కారం. చెప్పండి. విష్ణుసేనుడి గారి తల్లి ఎవరు ?

సం—సుదర్శనా దేవి.

న—అయ్యో దేవుడా ! మరి తండ్రి ?

సం—సుదర్శనా దేవిగారి భర్తే—కాశీరాజే.

న—అది కొంత నయమే, పోనీ ! అయితే అల్లాం టప్పుడు విష్ణుసేనుడు మరొక దంపతుల పుత్రుడెట్లా అయారూ ?

సం—అక్కడే ఉంది చిన్న రహస్యం. సుదర్శనా దేవికీ కాశీరాజుకీ వివాహం కాకుండానే విష్ణుసేనుడు ఆవిడ కడుపున పడ్డాడు. అనగా, వారి ప్రేమాగ్నికి ఉద్భవించాడు. ఆ సంగతి దాచడం కర్తవ్యం అనిపించి, సుదర్శన తన శిశువుని తన సోదరి సుచేతన దగ్గిరికి పంపించింది. ఆ పంపడం తన భర్త కాశీరాజుకీ తెలుసు.

న—ఆవిడ పంపేసింది సరే, ఇక్కడ చిక్కులు లేకుండా వ్యాపారం ఎల్లా సర్దుకుంది ?

సం—దైవానుకూలం ఉంటే ఏదైనా సర్దుకుంటుంది.

స—సుచేతనగారికి చిక్కారా లేదూ ?

సం—లేదు. అ సమయంలోనే సుచేతనకి పుట్టిన శిశువు కాలంచేశాడు. తన శిశువు మరణం కప్పెట్టి, తన శిశువు జీవించి ఉన్నట్టే కొత్తశిశువుని ఆవిడ పెంచింది.

స—అయితేమరి, సౌవీరరాజు వెర్రివారుటండీ ! ఆయన కనిపెట్టి ఉండరూ ?

సం—అదే దైవికం అంటే ! అప్పుడాయన లేడు. తన పిల్లాణ్ణి తిన్నగా ఎరగడు. నాటికి నేటికి ఆయనతో యథార్థం ఎవ్వరూ చెప్పలేదు.

స—అయితే కురంగికి సగంచిక్కుమాత్రం వదిలింది. ఏమంటారా, తనువరించిన బాలకేసరే, తనతల్లిగారుముచ్చట పడుతూన్న విష్ణుసేనుడు కావడం. కాని, కడం సగం చిక్కూ అల్లానే ఉంది. భూతికమంత్రి వెళ్ళి, సుకర్ణనాదేవిసీవారి కుమారుడు జయవర్మనీ వెంటపెట్టుగుని వచ్చారు. విష్ణుసేనుడి జాడ వీళ్ళకి తెలియలేదు గనక, కురంగిని జయవర్మకి ప్రధానం చెయ్యడం కాదు,—ఈ రాత్రి సుముహూర్తం ఉందిట—వివాహమే చెయ్యడానికి నిశ్చయించారు.

సం—అబ్బా ! అల్లాగా !

స—మరేమిటనుకున్నారు, తనూపా !

సం—వివాహం చెయ్యడానికి జయవర్మ ఉండాలా, లేకపోతే జయవర్మ బొమ్మకి చేసేస్తారా ?

న—సరే. బొమ్మేమిటండీ! జయవర్మ తల్లి వచ్చారుగా!

సం—సుదర్శనా జయవర్మ గడియకిందట తిరిగి కాశీ వెళ్ళిపోయారుగా!

న—అయ్యో! మీావన్నీ అద్భుతాలే!

సం—మరేమిటనుకున్నావు, తమాషా!

న—అయితే మహారాజుగారు బాధపడతారే!

సం—బాధ తొలిగించే సాధనమూ ఉంది.

న—మీకు వందనం. మీా ప్రతిభ మొదటనాకు తెలియలేదు, క్షమించండి. మీావంటి స్నేహితులు ఎంతో పుణ్యం చేసుగుంటేనే కాని దొరకరు. విష్ణుసేనుడుగారు పుణ్యాత్ములు.

సం—నీవంటి స్నేహితురాలు ఎంతపుణ్యం చేసుగుంటే దొరుకుతుందీ! కురంగి చాలా పుణ్యాత్మురాలు.

న—దాసురాల్ని. ఆజ్ఞాపించండి. స్నేహం ఋజువు చేస్తాను.

సం—మహారాజుగారి దగ్గిరికి మహారాణిని పంపించాలి. సౌవీరరాజు అజ్ఞాతంలో ఉన్నప్పుడు కూడా ఏదో మిషమీాద వాళ్ళింటికి వెడుతూండే 'సంతుష్టుడు' అనే ఆయన ఉన్నాడు. ఆయనకి విష్ణుసేనుడి సంగతీ, సౌవీరరాజు సంగతీ తెలుసునుట. ఇంకా ఏమిటో తెలుసునుట. ఆయన మహారాజుగారి దర్శనం కోరుతున్నారు. త్వరగా దర్శనం ఇప్పించవలిసింది—అని చెప్పాలి, అను.

న—ఒ . నిమిషం

సం—ఒక వేళ మహారాణిగారు నీకు లభించకపోతే?

న—[illegible], అప్పుడేం చెయ్యనూ?

సం—మరి నిమిషం అంటావేం ?

న—ఎరక్క.

సం—అప్పుడు భూతిక మంత్రితో చెప్పు—కౌంజాయన మంత్రితో వద్దు, ఆయన తెమలడు.

న—సరే, అయితే మీరిక్కడే ఉండండి.

సం—ఎందాకా ఉండనూ ?

న—వెళ్ళేదాకానూ. నిమిషంలో వచ్చేస్తాను. (అని ఎ. మ. కి పోతుంది)

సం—(పచారు చేస్తూ—తనలో) నళినిక చాలా గడుసుది. మొదట్లో నన్ను తీసేసింది గాని, ఇప్పుడు గణించి గ్రహిస్తోంది. పూర్తిగా కుడా గ్రహించేస్తుందేమో అని నాకు భయం వేస్తోంది. నా స్నేహం తను మెచ్చితే, తన స్నేహం నేను మెచ్చాను. కాని నాకు ధైర్యం చెడిపోలేదు గాని, విష్ణుసేనుడికి తెలిస్తే ఏం మెలివేస్తాడోగదా అని మాత్రం బెదురుగా ఉంది.

న—(ఎ. మ. నించి తీరిగా వస్తూ) ఎవరండీ అక్కడా ? రాజాజ్ఞ ! రండి.

సం—ఏమిటి ఆ దర్జా ? ఎవరితో చెప్పి వచ్చావు ?

న—సూటిగా వెళ్ళి మహారాజుగారితో చెప్పేశాను. ఆయనా ఆందోళనలోనే ఉంటూ, క్షణం ఆ 'సంతుష్టుడు' గార్ని ప్రవేశపెట్టు అన్నాడు.

సం—నడు.

న—(ఎ. ఎ. కి నడుస్తుంది.)

(సంతుష్టుడు నాసిక వెనకాలే వెళుతూండగా రెండో తెరలేస్తుంది. రాజుగారి గది. ఉన్నతమైన పీఠంమీద కుంతిభోజుడు ఠీవిగా కూర్చుని ఉంటాడు. రెండు మూడు పీఠాలుంటాయి.]

న—(కు. ఎ. నించి వచ్చి, వంగి, నమస్కరించి) జయం జయం మహారాజా! తమ ఆజ్ఞప్రకారం సంతుష్టుడు వచ్చారు.

కుం—రమ్మను.

సం—(కు. ఎ. నించి వస్తూ వంగి నమస్కరించి) జయం జయం మహారాజా!

కుం—కూర్చోండి, నువ్వెళ్ళు నళినికా!

న—(ఎ. ఎ. కి వెడుతుంది)

కుం—మీరు సౌవీరరాజుగారిని ఎరుగుదురా?

న—చిత్తం.

కుం—వారి వయినం కనుక్కోవాలని మేం యత్నించాం. లాభం లేకపోయింది. మీకు తెలుసునని మాకు తెలిసింది. సెలవిస్తారా?

సం—చిత్తం. ఈ ఉత్తరం గమనించండి (అని ఉత్తరం ఇస్తాడు)

కుం—(ఉత్తరం విప్పి చూస్తూ) "శ్రీశ్రీశ్రీ కుంతిభోజ మహారాజులుంగారికి — సౌవీరరాజు అనేక వందనములు. తాము మాకోసం మీ నగర చండాల వాటికలో వెతికినట్టు తెలిసింది. కారణాంతరంచేత నేను కుటుంబంతో అక్కడ ఒక సంవత్సరం అజ్ఞాతంలో గడపవలిసివచ్చింది. అక్కడ మేం దిగిన కొద్దికాలంలోనే మా విష్ణుసేనుడు మాకు కనపడకుండా వెళ్ళిపోయాడు. అనుకున్న కాలపరిమితి దాటగానే మేం మాపురం వచ్చేశాం. కాని, విష్ణుసేనుడు మాత్రం తిరిగి రాలేదు. ఏమయాడో! భగవద్విలాసం ఎట్లా ఉందో!...ఇట్లు, విధేయుడు, సౌవీరరాజు." మేమూ విచారించాం. కాని, పిల్లకి పెళ్ళి చెయ్యక తీరదుకదా! అందుచేత, భూతికమంత్రిని కాశీ పంపించి, మా సోదరి సుదర్శనసీ మా మేనల్లుడు జయవర్మనీ ఇక్కడికి రప్పించాం. ఈ రాత్రి మంచి ముహూర్తమే ఉందని దైవజ్ఞులు చెబుతున్నారు. విందులూ వేడుకలూ మెల్లిమెల్లిగా తరవాత జరిగినా, వివాహ లాంఛనం సత్వరంగా కానిచ్చేద్దామని నేను అనుకుంటున్నాను.

సుం—అల్లా చెయ్యడమే చాలా శ్రేయస్కరం ప్రభూ!

[ఎ. ఎ. నించి నళినిక వస్తుంది]

కుం—ఏం, ఎందుకు నళినికా?

న—జయం జయం మహారాజా! మహారాణిగారు మనవి చేసి రమ్మన్నారు.

కుం—ఏమనీ ?

న—విష్ణుసేనుడు వచ్చి అంతఃపురంలో ఉన్నారని.

కుం—దివ్యమైనమాట. అతడు సజీవుడై ఉన్నందుకు చాలా సంతోషం. ఆ సంగతి సౌవీరరాజుకి కూడా తెలియ పరుద్దాం. కాని వివాహవిషయంలో అతడి పేరు స్మరించడానికి చాలా వేళ మీరిపోయింది. వచ్చి చూస్తానని చెప్పు. వెళ్ళి జయవర్మని రమ్మను.

న—చిత్తం (అని, ఎ. ఎ. కి వెళ్ళిపోతుంది.)

కుం—ఇంతేకదూ తమకు తెలిసినదీ ? మరి సెలవా ?

సం—కాదు. మరి కొంచెం తెలుసును ప్రభూ ! (అని, మరో ఉత్తరం తీసి యిస్తాడు.)

కుం—ఓహోహో ! మీరు ఒక్కొక్కటే తీస్తున్నారే !

సం—అన్నీ ఒకమాటే అయితే శ్రమ అయిపోతుం దేమో అని, మహాప్రభూ !

కుం—(ఉత్తరం విప్పి చూస్తూ) "(శ్రీ)(శ్రీ)(శ్రీ) కుంతిభోజ మహారాజుగారికి—సోదరి సుదర్శన అనేక నమస్కారములు— మీ అనుజ్ఞప్రకారం ఈ రాత్రికూడా మీ నగరంలో ఉండి మీరు నిశ్చయించిన కార్యక్రమం జరపాలని అనుకున్నాను. కాని, ఈ ఉదయాన్ని అంతఃపురంలో నేను విష్ణుసేనుణ్ణి చూశాను. చాలా సంతోషమైంది. విష్ణుసేనుడు జయవర్మ కంటె పెద్దవాడు. ఆ సంగతి నాకూ నాభర్తకీ మన సోదరి సుచేతనకీ తెలుసును గాని, సౌవీరరాజుకి తెలియదు. అందు

చేత కురంగిని విష్ణుసేనుడికి ఇయ్యడమే సమంజసం. కురంగికి జయవర్మ వరహీనం. మీ మాటలు నెరవేరలేదని మీరను కోకండి. విష్ణుసేనుణ్ణికూడా నా గర్భవాసమందు పుట్టినవాణ్ణి లాగే నేనూ నా భర్తా చూసుకుంటున్నాం అని నమ్మండి. మాకు వాడొకటే జయవర్మ ఒకటే కాదు. నే నిక్కడే ఉంటే తమమాట తిరిగిపోతోందిగదా అని తమరు బాధపడడమూ, ఫరవాలేదులెండి అని మేం అనడమూ, ఏదోకొంత మేం చిన్నబుచ్చుకోకుండా ఉంటామా అని మళ్ళీ మీరు బాధ పడడమూ, ఇవన్నీ జరగవచ్చునని యెంచి, ఈ దినమే మేం కాశీ వెళ్ళిపోతున్నాం. కురంగీ విష్ణుసేనుల వివాహానికి అంతా వస్తాం. ముందు అసలు మీరు ఆ విష్ణుసేనుడికేసి చూడండి, మీకే బోధపడుతుంది. ఇట్లు, విధేయురాలు, సుదర్శన''— సరి యిక్కడికి నా బాధ కొంతవరకు తగ్గింది. మహారాణికి ఇదివరకే ఈ సంబంధం ఇష్టం. ఒక్కటే చిక్కు! అమ్మా యిని ఎట్లా ఇందుకు ఒప్పించడం? బాలకేసరి మీదినించి మనస్సు తిప్పేసుకోమని చెప్పడం ఎట్లా? ఆ వెనకటి అప్ర తిష్ఠ భరించడం ఎట్లా?

సం—విష్ణుసేనుణ్ణి పిలిపించండి, మహారాజా!

కుం—నళినికా!

న—(ఎ. ఎ. నించి వస్తూ) జయం జయం మహారాజా!

కుం—విష్ణుసేనుణ్ణి రమ్మన్నారని చెప్పు.

న—చిత్తం. (అని ఎ. ఎ. కి వెళుతుంది)

సం—క్షమించండి, మహారాజా! నాకు మరొక్క సంగతికూడా తెలుసు. సెలవిస్తే చెబుతాను.

కుం—చెప్పండి. మీరు అసాధారణులని తెలిసిపోయింది.

సం—విష్ణుసేనుడికి పెళ్ళి అయిపోయింది.

కుం—మీ కెట్లా తెలుసూ?

సం—ఇందాకా తెలిసింది.

కుం—మీ రెక్కడ చూశారతణ్ణి?

సం—అతడు కోటలోపలికి వెడుతూంటే పక్కవాళ్ళని కనుక్కొని తెలుసుగున్నాను.

కుం—బాగానే వచ్చింది చిక్కు! చిన్నవాడని చెప్పి జయవర్మని ఆవిడతీసుకుపోయి, విష్ణుసేనుడు పెళ్ళి అయి కూర్చుంటే, మళ్ళీ ఆ జయవర్మనే వెనక్కి రమ్మననా? భౌతిక మంత్రిని పిలుస్తానుండండి.

సం—అక్కర్లేదు. విష్ణుసేనుణ్ణి చూడండి, ముందు.

వి—(ఎ. ఎ. నించి వచ్చి వంగినమస్కరిస్తూ) జయం జయం మహారాజుగారికి—

కుం—ఆఁ ఆఁ

వి—అట్లా ఏదో అనుమానిస్తున్నారేం, మామగారూ, నన్ను చూసి!

సం—ఏంలేదూ! బాలకేసరి అని ఒకణ్ణి ఇక్కణ్ణించి లోగడ సాగనంపేశారు, హెచ్చుతగ్గుగా ప్రవర్తించినందుకు. మిమ్మల్ని చూస్తే మూడుమూర్తులా! అతడు స్ఫురిస్తున్నాడు.

కుం—(లేచి, విష్ణుసేనుణ్ణి సమీపించి) ఇప్పటికి నాకు బోధపడింది. రా, నాయనా! (అని కౌగిలించుకుని) నువ్వు వివాహం చేసేసుకున్నావు. అంటారేం ఆయనా?

వి—అవునండి.

కుం—ఎవర్ని?

వి—కుంతిభోజమహారాజు కూతుర్ని. గాంధర్వంలో

కుం—ఒస్, అదా! అంతేనాండి మీ అర్థం?

సం—చిత్తం మహారాజా! క్షమించండి.

కుం—విష్ణుసేనా, యథావిధి వివాహం చేస్తేగాని నా మనస్సు ఒప్పదు.

వి—(మహారాజుకి మోకరించి నమస్కరిస్తాడు)

కుం—నాయనా! దయచూపి సజ్జనుల్ని, జాలిచూపి సేవకుల్ని కూడగట్టుకో. ధైర్యం కనపరిచి పరరాజుల్ని జయించు. సత్యం ధర్మం ఆచరించి నిన్ను నువ్వు జయించుకో.

వి—(మోకరించే ఉండి) మహాప్రసాదం.

కుం—పెద్దల్ని మన్నించు. పుత్రుల్ని కను,

వి—(లేస్తూ) మహారాజా! నాకు రక్షకుడు, గురు దేవుడు, ఈ మహానుభావుడు. తరవాత సవిస్తరంగా చెప్ప గలను తమతో.

కుం—మరీ సంతోషం. వీరే నీకు కాగలమంత్రి.

సం—మహారాజా! ఒక కోరిక,

కుం—ఓ. కోరండీ.

సం—మీ రెండవపుత్రిక సుమిత్రని జయవర్మకి స్థిర పరచండి.

కుం—మంచిసలహా! మీరప్పుడే మంత్రిఅయినారే! మహారాణినీ సుమిత్రనీ కలుసుగుని కబురు పంపిస్తాను. అంతఃపురంలోకి నడవండి. అందర్నీ కలుసుగుందాం. నళినికా!

న—(ఎ ఎ, నించి వస్తూ) మహారాజా!

కుం—ఎదీ, దారి చూపించు, నడవండి.

వి—ఒక్కమాట, మహారాజా!

కుం—నీకు లోటేమిటి, విష్ణుసేనా?

వి—ఈ నళినిక కురంగి గురించి పడిన శ్రమకి ఏమిచ్చినా ఋణంతీరదు. ఆ సంగతి కురంగి చూసుగుంటుంది. కాని, మీయెదట నేను ఈవిషయం ఎత్తడం ఎందుకంటే, నా గురుదేవుడైన ఈ మహానుభావుడు ఒంటరిగా ఉన్నప్పుడు నాకు లొంగడేమో, అని.

కుం—మొదట నళినిక పేరు చెప్పి, తరవాత వారి పేరు రానిచ్చావు. వారు నళినికని వివాహం చేసుగోవాలని నీ కోరికఅని చెప్పాలనా? అది వారి యిష్టంలో ఉంటుంది కదా! ఏమంటారు, సంతుష్టా?

సం—అంతేనండి, మహారాజా!

కుం—వర్ణాంతరంకదా!

వి:—అదే తమకి మనవి చెయ్యదల్చుగుంటా! సంతుష్టుడు ఔషధం ఇచ్చి వర్ణం మార్చగలడు. ఏమంటావ్, నళినిశా ?

న —నా సర్వస్వమూ వారిదోసిట్లో ఇదివరకే పోశాను.

సం—అంతటితో ఊరుకున్నావా? నన్ను ఆ మరుక్షణమే లాగేశావుగా!

సుం—తీరిపోయె! ఇది మరీ ఆనందం. ఎంతోమంది అక్ఖర్లేదు, ఏ యిద్దరు కలిసినా ఆనందించతగ్గదే! కష్టాలు గట్టెక్కించిన దైవాన్నికొలిచి, ఏర్పాట్లు చేయిద్దాం, రండి.

(వాళ్ళు ఎ. ఎ. కి నడుస్తూండగా)

(తెర)

# బాలకృష్ణమాయ

(నాలుగు రంగాల రూపకం)

## పాత్రలు

వసుదేవుడు

నందుడు

కంసుడు

| | |
|---|---|
| మాలక్ష్మి<br>మధురం<br>బన్ను<br>కలబంద<br>శకటం | యాదవులు |

ప్రభవసేనుడు

## రంగాల పేర్లు

1 పసికూనల ఫిరాయింపు

2 కంసుడి మనఃక్షోభ

3 కృష్ణలీలా కథనం

4 కంస వధ

## రంగం—వచ్చే పాత్రలు

1—నం, వ

2—కం, వ

3 మా, మ, బ, శ, క

4 కం, ప్ర

## పాత్ర—వచ్చే రంగాలు

నం—1

వ—1, 2

కం—2, 4

మా—3

మ—3

ఐ—3

శ—3

క—3

ధ్రు—4

## రంగం-1

(రేపల్లెవైపు యమునాతీరం, అర్ధరాత్రి తరవాత కన్నూ కన్నూ కనపడని చీకటి, శవాన్ని మోసుగుని నందుడు వస్తాడు).

నం—(తనలో) ఈ పిల్ల పుట్టకపోతేం, వెంటనే మరణించక పోతేం! ఋణానుబంధం! యశోద ఏస్థితిలో ఉందో! ఈ పిల్లని కనగానే స్పృహతప్పి పడిపోయింది. పిల్లని కన్నదో పిల్లాణ్ణికన్నదో కూడా యశోద ఎరగదు. రేపు ఇంద్రోత్సవం. ఈ శవాన్ని ఉదయంవరకూ ఉంచి జాగరం చేద్దాంఅంటే గొల్లలంతా ఉత్సవంగురించి ఉసూరుమని పోతారని రాత్తిరికి రాత్తిరి ఈ పుట్టుగుడ్డు కళేబరాన్ని తీసుగువచ్చేశాను.

(కు. ఎ. చూస్తూ) ఇందాకణ్ణించీ భయంలేదుకాని ఇంత దూరం వచ్చిం తరవాత ఇప్పుడు వేస్తోంది దారుణ భయం. ఆ వైపునించి ఏదో దెయ్యం నాకేసి వస్తూన్నట్టుంది.

('నందా' అని ఎవరో పిలిచినట్టవుతుంది)

ఎవరి గొంతిగ అదీ? వసుదేవుడి కంఠంలా ఉందే! ఇతడెప్పుడు పోయాడూ చెప్మా! (పైకి) బతికుండగా బాధించావు నన్ను, చచ్చిం తరవాత కూడా సాధించడం ఎందుకు గనక, నన్నువదిలెయ్!

వ—నందా, నేను వసుదేవుణ్ణి.

నం—యమునదాటి మథురనించి ఇక్కడికి వచ్చావా?

వ—ఆశ్చర్యాలు చూసి చూసి నువ్వు కనపడితే చాలని వచ్చాను. నువ్వే కనపడడం పరమాశ్చర్యంగానూ దైవ యోగంగానూ తోస్తోంది. నువ్వు దుఃఖంలో ఉన్నట్టున్నావు ?

నం—అవును. పుట్టినపిల్ల పుట్టగానే జారిపోయింది. శవాన్ని తెచ్చేశాను యమునకి అర్పిద్దాంఅని.

వ—కొంత సేపు నిదానించక పోయావా ? ప్రాణం చేరుకునే దేమో !

నం—నిదానించ వలసిందేగాని, తెల్లవారగానే ఇంద్రోత్సవం. వ్యక్తిదుఃఖం వెళ్ళి సంఘాన్ని బాధించ కూడదని తొందరపడ్డాను. నీ సంగతేమిటీ ? అదీ యీ బాపతేనా ?

వ—కాదు. దేవకి అర్ధరాత్రివేళ కారాగృహంలో కొడుకుని కంది. దేవతలు పుష్పవృష్టి కురిపించారు. పంచభూతాలూ హర్షించాయి. దివ్యనాదాలు వినిపించాయి. దేవకి కుర్రాణ్ణి దీర్ఘంగా చూస్తానంది. నాకు కంసుడు జ్ఞాపకం వచ్చాడు. దీర్ఘంగా కుర్రాణ్ణిచూస్తూ కూచుంటే ఈ తేజశ్శాలి మనకి దక్కడు, ఎక్కడికేనా తీసికెళ్ళి అప్పగించేస్తానన్నాను.

నం—అనడంఅంటే అన్నావుగాని, వీలెదీ ?

వ—అదే ఆశ్చర్యం. చెరసాల తలుపులు వాటంతటఅవి తెరుచుకున్నాయి. కాపలాజనం అందరూ నిద్దర్లకి పడ్డారు.

నం—ఆహా దైవమాయ.

నం—వచ్చేశాను. పిల్లాడు సామాన్యపు బరువుకాదు. మధుర ద్వారాలు దాటగానే ఏకచీకటి. ఆకాశం చీకటి కురిసింది, గాలి చీకటి ఈనింది, భూమిలోంచి చీకటి మొలిచింది. నా శరీరానికి చీకటి ఫ్రాతపూసి నట్లైంది. చూపు వ్యర్థం అయింది. అడుగు ఏవేపు పెట్టినా ఒకలాగే ఉంది. గభుక్కున వెలుగువచ్చింది. కంసుడు వెంట తరుముతున్నా డనిపించింది. కత్తి దూశాను.

నం—అయ్యో!

వ—కాని ఆ తేజస్సు బాలుడిదే. మరీ ఆశ్చర్యంవేసి పోయి ముందుకి సాగాను. యమున కనిపించింది. వాన్లకి వరదల్లో ఉంది. యత్నం అంతటితో సరి అనుకున్నాను. కాని, సాహసించి అడ్డపడ్డాను, పాములున్నాసరే, మొసళ్ళున్నాసరే అని.

నం—అయ్యబాబో, అంత లోతులో!

వ—అదే దైవకృప! నీళ్ళు దారిచ్చాయి. మేటవేసి నట్టయింది. దానిమీాద నడుచుగుంటూ, భగవంతుడు అభయం ఇచ్చి చెయ్యిపట్టుగుని నడిపించి నట్టుగా ఇవతలి గట్టుకి చేరుకున్నాను. నువ్వు కనిపిస్తే కృతార్థుణ్ణి అవుతా ననుకున్నాను.

నం—కనిపించాగా?

వ—కనిపిస్తేం ? నీ మనస్సు ఎంతో బాధతో ఉంది. పైగా, చెప్పేడుమాటలు విని నీకు లోగడ నేను క్షోభ కలిగించాను.

నం—అయినాసరే, నువ్వు ఆజ్ఞ నిర్వర్తించావేగాని, అంతకంటె నాకేమీ కీడు చెయ్యలేదు. సరిగదా, ఉపకారాలూ చేశావ్. నేను విశ్వాస ఘాతుకుణ్ణికాను. నావల్ల అయేపని ఏమన్నా ఉంటే చెప్పు.

వ—ఏముందీ ? ఈ పిల్లవాణ్ణి తీసికెళ్ళి కడుపులో పెట్టుకోవాలి. వీడు నాకు కన్నకొడుకని తెలిసిపోయిందా, ఆ కంసుడు వీణ్ణి పొట్టని పెట్టుకుంటాడు.

నం—గొప్పతంటాయే, స్వామీ ! వీడు నాదగ్గిర పెరుగుతున్నాడని తెలిస్తే, కంసుడు నాతల తీసెయ్యడూ !

వ—నీకూ నాకూ మాత్రమే తెలిసింది, బట్టబయలు ఎట్లా అవుతుందీ ?

నం—నీ భార్యకి కూడా తెలుసుగదా ?

వ—నా భార్యా నేనూ ఒకటేకదా ? కన్న సంతానం ఎక్కడో అక్కడ సుఖంగా ఉండాలని కోరుకోని తల్లి ఉంటుందా ? సంతానం యొక్క క్షేమ జీవితం ఒకరహస్యం మీద ఆధారపడి ఉన్నప్పుడు ఆ రహస్యం దాచని తల్లి ఉంటుందా ? దేవకి పుత్రవాత్సల్యం లేని ఘటమా ?

నం—సరే. సాహసిస్తాను. ముందు ఈ పిల్ల కళేబరాన్ని యమునలో పారేసి వస్తాను.

వ—వద్దు. ఆగు, దీన్ని నేను తీసుకుపోతాను. తీసుకుపోయి, దేవకి ఒళ్ళో పారేస్తాను. నీ భార్యకి స్మృతి తప్పిపోతా, కనడంతోటేనా ?

నం—ఆ. పుట్టింది పిల్లో పిల్లాడో ఆవిడ ఎరగదు. ఈ పిల్లాడే మాకు పుట్టినట్టు నమ్మేస్తుంది, బాధలేదు. సరే, శవాన్ని మోసుగొచ్చిన శరీరంగనకనాది. స్నానంచేసి వస్తాను యమునలో దిగి. అరే, ఈ పక్కనే నీళ్ళు ఇప్పుడు ఊరుతున్నాయే! ఇది దైవికమే. (అని పక్కనున్న నీళ్ళతో శరీరం శుచిపరుచుకున్నట్టు నటించి) సరే. పిల్లాణ్ణి తీసుకుని వెడతాను. (అని తట్ట ఎత్తబోయి) అరే. చాలా బరువే. బ్రహ్మాండమైన బరువు. బురదలో దిగబడ్డ సరుకు బండీని నేను నెట్టగల్ను, పిచ్చెత్తిన అడివిగిత్తని కొమ్ములట్టుకొని మళ్ళెయ్యగల్ను, గాని, ఈ బరువు మొయ్యలేకుండా ఉన్నానే! భగవంతుడా! నీదయ పూర్తిగా రానీవయ్యా, నిన్ను నమ్మినవాళ్ళమీదా! (అనగానే కుర్రాడు తేలిక పడడమూ తన కాలి సంకెలి గొలుసు ఊడి పడిపోవడమూ గమనించి)

అరే. ఎంత తేలికయ్యాడో! నా సంకెళ్ళుకూడా ఊడిపోయినాయి.

వ—నందా! ఎల్లాచూసుకుంటారో పిల్లాణ్ణి, నువ్వూ యశోదానూ!

నం—పువ్వుల్లో పెట్టి పెంచుతాం. మాకు ఇతడే ప్రభువు అనుకుంటాం. ఇక్కడికెళ్ళి పాలూ, అక్కడికెళ్ళి పెరుగూ, ఓచోటికెళ్ళి వెన్నా, మరోచోటికెళ్ళి మజ్జిగా, ఇంకోచోటి కెళ్ళి అట్లూ ఆరగించేస్తూంటాడు ఇతడు. ఇతడు మిమ్మల్నీ మమ్మల్నీ కూడా ఉద్ధరిస్తాడు. మానందరికీ కన్నవాడు.

వ—నందా! నీకు ఎల్లకాలమూ కృతజ్ఞుణ్ణి.

నం—మానుమధర్మం నిర్వర్తించాను, అంతే.

వ—అంతేకాదు. నీకు సంబంధించిన ప్రాణి దక్కక బాధలో నువ్వున్న సమయంలో నాకు సంబంధించిన ప్రాణిని రక్షించి పోషించడానికి ఒప్పుగున్న మహానీయుడవు.

నం—ప్రాణరక్షణ మానవజాతికి అంతకీ సంబంధం ఉన్నదిగనక మహత్తమం అయింది.

వ—కంసుడివల్ల భయం లెక్ఖచెయ్యని సాహసివి.

నం—చేస్తూన్నది ధర్మవిరుద్ధం కాదుగనక. సరే వసు దేవా! నువ్వెళ్ళు. ప్రాణరక్షణ చేసేవాళ్ళ ప్రాణాలకి ప్రాణికోటిని సృజించినవాడు తనప్రాణం అడ్డువేస్తాడు.

(అంటూ ఎ. ఎ. కి నిష్క్రమిస్తాడు)

వ—(ఎ. ఎ. నందుడు వెళ్ళినచోటినించి కు.ఎ. నడుస్తూ) ఓహో! నందుడెంత సజ్జనుడూ! (అని, పిల్ల ఏడ్పువిని) అరె. (అని వెనక్కి తిరిగి) పిల్ల ఏడుపు వినబడుతోందే! నందుడు కంసభయంవల్ల వెనక్కి రావడంలేదుకదా! కాదుకాదు. ఈ పిల్లే ఏడుస్తోంది. నందు డనుకున్నట్టు

పోలేదు. జీవించేఉంది. అతడు పోయిందనుకున్నాడు .గాని, అసలు పుట్టింతరవాత జీవం చేరుకుంటూ ఇప్పుడేమో! ఈ పిల్ల మహిమ నన్ను చెరసాలకి చేరుస్తుంది. నే నక్కడికి చేరినతరవాత తలుపులు వాటంతటు అవే తాళాలు పడి పోతాయి. ఎవళ్ళూ అనుమానించరు ఈ పిల్లని దేవకిఒళ్ళో పడుకోపెడతాను. దైవకృప! (అని కు. ఎ. కి పోతాడు.)

(తెర)

---

## రంగం-2

(కంసుడి శయ్యామందిరం. పక్కమీద పసుపని, నిద్రపట్టక, ఏవో దృశ్యాలు చూసి భయపడుతూన్నట్టు కాళ్లా చేతులూ కొట్టుగుంటూ, లేచి కూర్చుని, కళ్ళు తెరవబోయి మళ్ళీ మూసుగుంటూ, మొహం చేతుల్లో కప్పెట్టుగుంటూ, స్వప్న జాగ్రదవస్థల మధ్య రంగంలో ఉన్నట్టు నటిస్తాడు)

కం—ఇది కలా లేక మెలకువా! సౌధాలన్నీ నేల పడ్డాయి. తుఫాను కెరటాల్లో నావలాగ భూమి ఉయ్యాల ఊగుతోంది. ఏ ళ్ళెవళ్ళు? కారునలుపుగా ఉన్న చండాల కన్యలు, నాతో భయంకర శృంగారం మొదలెట్టారు. అరే! నేను మరణదేవతని చంపగల్ను, భయదేవతని భయపెట్టగల్ను! కాని. కామదేవత నన్ను వెంటాడించి, చికాకుపరుస్తూనే ఉంది. (తనకి కనిపిస్తూన్న చండాల

కన్యల్ని ఉద్దేశించి) ఎవరా వస్తూన్నది! పొండి. అవతలకి పొండి, దిక్కుమాలి ఘటాలు, నల్లగా మసిలాగ, పారపళ్లూ పచ్చటి పాముకళ్ళూ వేసుగుని! కొరువులు చేతుల్లో పట్టుగుని! అమ్మ! ఈ పిశాచాలన్నీ పోయాయిబాబూ! మళ్ళీ ఈ ఆకారం ఏమిటి? మధూకశాపమూర్తివా? శ్మశానం నించి వచ్చావా? అబ్బ ఎంత అసహ్యమో, ఎంత భయంకరమో! నా హృదయంలో ప్రవేశించి నా అంతం చూస్తావా? చూద్దాంలే. కాకి రెక్కతో విసిరితే పర్వతం కంపిస్తుందా? పుడిసిలితో తాగడం మొదలెడితే సముద్రం ఇంకుతుందా! ఏమిటీ? కాలక్రమాన్ని నాకే తెలుస్తుందా! తెలియసిస్తూ, తొందరేమిటీ!

ఈ గాలివానా, ఈ భూకంపమూ, ఈ ఉల్కాపాతాలూ— వీటికి అర్థం ఏమిటో ప్రశ్న కనుక్కు రమ్మని కంచుకిని పంపించాను. ఎవడో దేవలోకంలో ఉండేవాడు భూమిమీద ఏదో రహస్యపు పని ఉండి అవతరించాడని అన్నారని చెప్పాడు. ఎవరింట్లో పుట్టాడో కనుక్కురమ్మంటే, దేవకికి ఆడపిల్ల పుట్టిందని వార్త తెచ్చాడు. వసుదేవుడు గుణవంతుడూ సత్యవ్రతుడూనూ. అతడినోట అబద్ధం రాదుగనక, అతణ్ణి తీసుగు రమ్మన్నాను. వసుదేవుణ్ణే అడిగేస్తాను.

(కు. ఎ. వించి వసుదేవుడు వస్తాడు)

వ—(వస్తూ తలవంచి నమస్కరిస్తాడు)

కం—కూర్చో, వసుదేవా!

వ—నన్నెందుకో పిలిచారు !

కం— దేవకికి పురుడు వచ్చిందిటగా !

వ—అవును.

కం—పిల్లా, పిల్లాడా !

వ—(తనలో) నేనుకూడా అనృతం ఆడనా? బాలప్రాణ రక్షణకోసం ఆడింది ప్రతీదీ సత్యమే. (పైకి) దేవకికి ఆడపిల్ల పుట్టింది.

కం—పిల్లయేటి పిల్లాడయేది నేను చంపితీరాలి. లేక పోతే, విధిని దగాచెయ్యడానికి వీల్లేదు.

వ—పుట్టింది ఆడకూన గనక దీన్ని వదిలివెయ్యండి అని బావగార్ని ప్రార్థిస్తున్నాను. పుట్టింది మేనల్లుడుకాదు, మేనగోడలే గనక దీన్ని రక్షించి విడిచిపెట్టవలిసిందిగా మిమ్మల్ని వేడుకోమని మీచెల్లెలు కోరింది.

కం—ఎవరు పుట్టినా వాళ్ళని నాకు అప్పగించేస్తానని నువ్వు వాగ్దానం చెయ్యలేదూ !

వ—అయ్యో, చేశాను (తనలో) ఇంకోరి పిల్లని ఎట్లా బలికి అర్పించనూ? పోనీ పరిగెట్టివెళ్ళి ఆ పిల్లాణ్ణే తెచ్చి ఇచ్చెయ్యనా? అక్కర్లేదు. ఈ పిల్ల చచ్చి బతికిన వ్యక్తి.

వీడిచేతిలో మరణం పొందేరకం అయి ఉండదు. (పైకి) అయితే, పిల్లని తీసుకు వస్తాను!

కం—తక్షణం తీసుకురా.

వ—(కు. ఎ. కి విచారంతో వెడతాడు)

కం—(కంగారుపడుతూ) అయ్యో! ఆ పిల్లని ఎల్లా చంపడం? ఎంత తేజస్సుతో ఉంటుందో! ఆరుగుర్ని చంపే శాను! వాళ్ళరూపాలు కన్నుమూసేసరికి ప్రత్యక్షం అవు తూంటాయి. పైగా, ఇది ఆడకూన. ఆడదానివల్ల నాకు చావు ఉంటుందని ఎవరూ అన్లేదుగా! అయితేం? నేను రాజుని. మాట అనేశాను. ఎవరి ప్రాణంపోయినా సరే ఆమాట నిలబెట్టుకోవాలి. నా చెయ్యి అప్పుడే వణికిపోతోంది. (నిర్ఘాంతపోయి చూస్తూ) నాకు భవిష్యమూ గోచరిస్తోంది. ఆ పిల్లని నేను చంపలేను. అయినా నా యత్నంలో వెనక్కి వెళ్ళలేను. పీడాపరిహారం నిమిత్తం ఏ జపాలేనా చేయిం చాలి. (అని, ఎ. ఎ. కి భయంతో తీవిగా నడిచిపోతాడు).

(తెర)

# రంగం-3

[అరుబయలు. మాలక్ష్మి అనే ముసలి గొల్లవామా, బన్ను మధురం అనే గొల్లబాలురూ ఉంటారు. కర్రలూ, ఊదే కొమ్ములూ, పిల్లనగ్రోవులూ, చిక్కాలూ చద్దులూ ఉంటాయి.]

మా—నిజమే, నాయనా! అప్పుడు మీరు ఊళ్ళో లేరు. ఎంతో మంది గొల్లపడుచులు పువ్వులతో అలంకరించుగుని వచ్చారు. ఎంతమంది వచ్చారో అందరు కృష్ణులు కనిపించారు. ఎక్కడ చూసినా కృష్ణుడే. శిరస్సుతో నేత్రాలతో పెదవులతో చేతులతో పాదాలతో కృష్ణుడు చూపించిన విన్యాస విలాస విశేషాలు వర్ణించలేం. కన్నులపండువైపోయింది. అందరూ దివ్యగానం చేశారు. అంతా ఆనందంలో మునిగిపోయారు.

బ—అయ్యో! మళ్ళీ అల్లాంటిది ఎప్పుడో!

మా—కాని, ఆ మధ్యలో, అరిష్ట వృషభుడనే రాక్షసుడు పిడుగులా వచ్చి పడ్డాడు.

మ—అయ్యబాబో!

మా—ఆ పక్కని ఒక గుట్ట ఉంది. అందర్నీ దాని మీదికి ఎక్కిపొమ్మని కృష్ణుడు కిందే నుంచున్నాడు. ఆ ఎద్దు రూపం "నేను రంకెవేస్తే స్త్రీలు ప్రసవిస్తారు, డెక్కతో

తొక్కితే భూమి పాతాళం అంటుతుంది. నందుడి కొడుకు ఎవడు ?''—అన్నాడు. 'నేనే' అన్నాడు కృష్ణుడు. 'నువ్వు భయపడవేం ?' అన్నాడు వృషభుడు. 'భూమిమీద భయం అనేది లేకుండా చెయ్యడానికి వచ్చినవాడికి భయం ఎల్లా ఉంటుంది ?' అని సమాధానం చెప్పాడు దామోదరుడు. 'నువ్వు కుర్రాడివి గనక, నీ కింకా భయం అంటే తెలియదు పాపం! ఏమిటి నీ ఊహ !' అని అడిగాడు వృషభుడు. 'నా ఊహ నిన్ను చంపాలనే !' అని అందించాడు కృష్ణుడు. అంత నమ్మకం నీ కుంటే నీ యిష్టం వచ్చిన ఆయుధం తీసుకో' అన్నాడు వృషభుడు. 'నా చెయ్యి చాలు రారా అధమా, నేను ఒంటికాలిమీద నిలబడతాను, కదిపిచూడు కావలిస్తే!' అని కూడా అన్నాడు. వృషభుడు కమ్మిచూశాడు. లాభం లేకపోయింది. కొమ్ములు పట్టుగుని గిర గిరా తిప్పి వృషభుణ్ణి కృష్ణుడు గిరవ వేశాడు.

మ—ఇదంతా నిజమే ?

మా—నువ్వు చూసింది మాత్రమే నిజం అంటే ఎట్లా నాయనా ! నందు డింట దామోదరుడు పుట్టడం మొదలు, మనకి క్షీరసమృద్ధి, ధనధాన్య సమృద్ధి, ఫలసమృద్ధి, గ్రాస సమృద్ధి.

బ—అదివరకు ?

మా——అదివరకు మనఊరు బోడిగా ఉండేది. పువ్వు పుట్ట గానే వాసన! పుట్టింది మొదలూ దామోదరుడు ఉపకారమే చేశాడు.

బ——ఎవరికీ?

మా——జనానికి! దుష్టుల్ని నాశనం చెయ్యడం సజ్జనులకి ఉపకారంకాదూ? రోగం అనేది లేకపోవడాన్నే కదా ఆరోగ్యం అంటారు. తను పుట్టిన పదోరోజున పూతన అనే రాక్షసి ఇష్టంచొప్పున పాలూ, ఇష్టం లేకుండా ప్రాణమూ, తాగేశాడు.

మ——అది ఎందుకు వెళ్ళిందీ అక్కడికీ?

మా——కంసుడు పంపించాడు, ఆ బాలుణ్ణి చంపిరమ్మని.

మ——కంసుడెవడండీ?

మా——దామోదరుడి మేనమామ. మంచివాడేగాని వాళ్ళనాన్నని ఖైదులో పెట్టడంలాంటి పన్లు చేశాడు. దామోదరుడు తన్ని చంపేస్తాడేమో అంతకంటె ముందు అతణ్ణి చంపేద్దామని!

బ——అయితే, భగవంతుడికీ శత్రువులున్నారన్నమాట!

మా——లెఖ్ఖేముంటి! మామూలు మంచితనం గల మనుష్యులకే శత్రువులు నిష్కారణంగా ఉండేటప్పుడు పూర్ణపురుషుడికి శత్రువులుండరూ? నెలవయస్సుండగా

దామోదరుడు శకటాసురుణ్ణి చంపేశాడు. గొడ్డేళ్ళప్పుడు ఇంట్లోవీ ఊళ్ళోవీ వెన్నమీగడలు లగాయించేసినందుకు, యశోద రోటికి కట్టేస్తే దామోదరుడు దాన్ని రెండు మద్ది చెట్ల మధ్యనించి ఈడ్చుకుపోయి ఇద్దరు గంధర్వులకి శాప విముక్తి ఇచ్చాడు.

[ఎ. ఎ. నించి రొజుకుంటూ భయంతో ఆశ్చర్యంతో కలబంద పచ్చిపడతాడు]

మా—ఏమిటి ఏమిటి? (అని కంగారుగా లేస్తారు.)

కల—కృష్ణుడు, కృష్ణుడు (అని, గుటకేసి వగురుస్తాడు)

మా—ఏంజేశాడు?

కల—చెట్టెక్కి అక్కణ్ణించి ఉరికాడు, అంతా వద్దంటూంటే!

మా—ఎక్కడా?

కల—కాళింది మడుగులో!

మా—అయ్యో! అదంతావిషం. దాని స్పర్శగాని వాసనగాని తగుల్తే ప్రాణం తీసేస్తుంది.

కల—కృష్ణుడేమవుతాడో అని భయంవేసి పరిగెసుకు వచ్చాను.

మా—అయ్యో వెర్రివాడా! కృష్ణుడికి ఏంభయం? కంగారుపడకు. కంగారువల్ల అపాయంతగ్గదు.

[ఎ. ఎ. ఎంచి ఉత్సాహంలో శకటంవస్తాడు]

—ఏరా శకటం! ఏమిటి విశేషం?

శ—మడుగులో పాంపడగమీద కృష్ణుడు నృత్యం చేశాడు.

మా—అది కృష్ణుణ్ణి ఏంజేసింది?

శ—నెత్తురు కక్కుకుంటూ ప్రార్థించింది. ఆ పాం సంసారంకూడా వచ్చి కృష్ణుణ్ణి వేడుకున్నమీదట, కృష్ణుడు పామునిచంపకుండా వదిలేసి, మరోచోటికి లేచిపోయి బుద్ధిగా బతకమన్నాడు. గరుడుడు చంపేస్తాడని పాం గోలపెట్టింది. నీ పడగమీద నా అడుగులముద్ర నిన్ను కాపాడుతుందిలే భయంలేదన్నాడు, కృష్ణుడు.

మ—ఆ పాంవల్ల తప్పేమిటండీ?

మా—సంఘానికి ప్రాణాధారమైన నీళ్ళన్నీ తనే భుక్త పరుచుగోడంవల్ల అవి విషంఅయినాయి.

బ—పోనీ, దాన్ని పూర్తిగా చంపెయ్యకపోయాడా కృష్ణుడు?

మా—తిన్నపడ్డతరవాత ఎవర్నైనా చంపడం ఎందుకు నాయనా?

బ—తిన్నపడ్డట్టు నటించి, మళ్ళీ ఎప్పటి ఆటే ఆడితే ?

మా—ఆ పాంఅల్లా చేసేరకం కాదని కృష్ణుడు కనిపెట్టి ఉంటాడు.

బ—నే చెప్పేది మనుష్యులమాట !

మా—వాళ్ళని మనుష్యులనకు. ఈ పాముకంటె హీన జాతి జంతువులను, లేక దేవాతీతులను. సరేగాని, మనం వెళ్ళి ఈ మహాద్భుతాలకి కర్త అయిన ఆ శ్రీకృష్ణుణ్ణి కళ్లారా మళ్ళీ చూసివద్దాం నడవండి.

శ—మనం వెళ్ళినా శ్రీకృష్ణుడిప్పు డక్కడఉండడు.

మా—ఏం ?

శ—కంసుడు కృష్ణుణ్ణీ బలరాముణ్ణీ మధుర తీసుగు రావలిసిందిగా ఆజ్ఞ పంపించాడు-ఏదో ధనుస్సు పండగ చేస్తాడట.

మా—అల్లాగా !

మ,బ—మనకి ఎప్పుడు ప్రాప్తంఉందో అప్పుడు మళ్ళీ చూస్తాం కృష్ణుణ్ణి.

(తెర)

# రంగం-4

(కంసుడి మందిరం. కొన్ని కుర్చీలు ఉంటాయి. కంసుడు కంగారుగా ఇటూ అటూ తిరుగుతూ ఉంటాడు).

కం—(తనలో) ఉత్సవం మిషమీద బలరామ కృష్ణుల్ని పిలిపిస్తున్నాను. వస్తాదులచేత వాళ్ళని చంపించేస్తాను. అసలు వాళ్లువచ్చే దార్లో వాళ్ళని చంపడానికి కువలయా పీడం అనే ఏనుగుని ఖంజాయించమని ప్రధానమంత్రితో చెప్పాను. ఎవరక్కడ? ధ్రువసేనా! (అని ఎ. ఎ. కి చూస్తాడు)

ధ్రు—(ఎ. ఎ. నించి వస్తూ) చిత్తం, దేవా!

కం—రామకృష్ణులు వచ్చారా?

ధ్రు—వస్తున్నారండి. మీ దుస్తులు మన చాకలి తెస్తూంటే, వాణ్ణి చావదన్ని అవి తస్కరించి, తమవి తొడి గేసుకున్నారు. ప్రధానమంత్రి వాళ్ళమీదికి కువలయా పీడాన్ని పంపగా, ఆ ఏనుగు దంతాలు రెండూ ఊడపీకి, వాటితోనే దాన్ని పొడిచి చంపేశాడు దామోదరుడు.

కం—ఆఁ, ఏమన్నావ్, ఆ ఏనుగుని చంపేశాడా? (అని కుర్చీలో కూలబడతాడు) సరే సరే. వెళ్ళి ఇంకా దామో దరుడు ఏం చేస్తున్నాడో చూసిరా?

ధ్రు—చిత్తం (అని కు. ఎ. కి పోతాడు)

కం—(శూన్యం కేసి కు. మ. వైపు చూస్తూ భయంతో)
ఎవరబ్బాయి నువ్వూ? కృష్ణుడివా? నన్నా బెదిరిస్తున్నావు?
(అని కత్తిదూసి అటువెళ్ళి) అరే ఇక్కడ ఎవడూ లేడే!
(వెనక్కి తిరిగి ఎ. మ. కేసి చూస్తూ) ఈవేపు వచ్చావా?
ఇంకా ఊళ్ళోనే ఉన్నాడని వాళ్ళంతా చెబుతూంటే,
లోపలికెల్లా వచ్చావు? (అని ఎ మ. నడిచి) అబ్బే,
ఎవడూ లేడూ! నేనే అనుకుంటూన్నట్టున్నాను.

ధ్రు—(కు. ఎ. నించి వస్తూ) ఘోరం మహారాజా,
ఘోరం!

ధ్రు—ఏమిటి ధ్రువసేనా?

ధ్రు—రామకృష్ణులు మన ధనుశ్శాల ప్రవేశించి, రాజ
ధనుస్సుని రెండు ముక్కలుగా విరిచి, అధికారి సింహాలుణ్ణి
చంపేసి, శాలయావత్తూ చిందరవందర చేసేశారు. దామో
దరుడు మదనికి అచే కూనుపిల్ల వీపు నిమిరి పాద్యం స్వీక
రించి దాన్ని తిన్నపరిచి అందకత్తెనిగా చేశాడు

కం—దామోదరుడంటే, నల్లగా ఆజాను బాహువుల్తో
విశాలవక్షంతో ఏనుగు నడకతో ఉండే వాడేనా?

ధ్రు—ఇంకా రాలేదే! ప్రభువువారు ఎట్లా వర్ణిస్తు
న్నారు దామోదరుణ్ణి?

కం—ఇందాకా ఈ గదిలో కనిపించాడు నువ్వు చెప్ప
డాన్నిబట్టి ఇక్కడికింకా రాలేదని అనుకోవలసొస్తోంది.

చాలుగాని, వెళ్ళి చాణూర ముష్టికుల్తో చెప్పి, వాళ్ళనిరావ కలబడ మను.

భ్రు—చిత్తం. దామోదరుడు ధనుశ్శాలలో ఉంటూన్న సమయంలోనే తను కిక్కడ కనిపించడం ఆశ్చర్యంగా ఉంది.

కం—ఆశ్చర్యం ఇంకా ఎక్కువ అయేటట్టు ఉంది. త్వరగా వెళ్ళు. వాళ్ళు గబగబా వచ్చి పడగల్రు.

భ్రు—చిత్తం (అని కు. ఎ. కి పరిగెడతాడు)

కం—(శూన్యంకేసి చుట్టూ చూస్తూ కింద కూలపడి) ఓయి బాబో! దామోదరా! ఇంతమంది దామోదరు లేమిటి చెప్మా! ఏం దామోదరా! నువ్వు ఒక్కడవా అనేకుడవా? నువ్వు ఊళ్ళో ఎవో పన్లు చేస్తున్నావని వాళ్లు చెబుతూంటే ఈలోపలే ఇంత బహుళంగా ఉన్నావే! అప్పుడు ఆ ఆరుగురి పిల్లల్నీ చంపేశాను. అయిగో వాళ్ళ మొహాలు, నా మొహంకేసి ధిక్కరించి చూస్తున్నాయి. ఆ ఆడపిల్లని కూడా చంపా లనుకున్నాను, ఆ పిల్లయొక్క భాగంపైకి ఎగిరి నేనే చావబోతున్నా నని సూచించింది. నా తండ్రి చెరసాలలో ఏడుస్తున్నాడు, ఆ ఏడుపు వినపడు తోంది. దామోదరా! నా శరీరాన్ని నా ఆత్మే చంపే స్తోంది. నేను బతకను. నువ్వు చెయ్యిచేసుగోవాలా మహాను భావా!

భ్రు—(కు. ఎ. నించి గబగబా వస్తూ) ప్రభూ ప్రభూ! దారుణం దారుణం! చాణూరుణ్ణి దామోదరుడూ ముష్టికుణ్ణి

బలరాముడూ చెరోపోటూ పొడిచేసరికి, వాళ్ళిద్దరూ నెత్తుళ్లు కక్కుగుని చచ్చిపోయారు. రామకృష్ణుల్ని అడ్డేవాళ్ళు మరి ఎవరూ లేరు.

కం—మళ్ళీ చూసిరా.

ధ్రు—(కు. ఎ. కి వెడతాడు)

కం—(పీఠం వేసుగుని, కత్తి పారేసి. కళ్ళుమాత్రం తెరిచి, నిశ్చేష్టుడై కూర్చుంటాడు.)

ధ్రు—(కు. ఎ. నించి వస్తూ) సింహద్వారం దగ్గిరికి వచ్చారు, మహారాజా! లోపలికి వచ్చి మహారాజుకి జోహారు చేయవలిసిందని నేను వాళ్ళతో అన్నాను. అంటే "దేనికి మహారాజు? శూన్యత్వానికా? అంతే మీ కంసుడికి పట్టేగతీ!" అన్నారు.

కం—(కళ్ళు మూసుగుంటాడు.)

ధ్రు—(కు. ఎ. కి మళ్ళీ చూసి) ఇదుగో వచ్చారు, ప్రభూ!

కం—(వెనక్కి పడిపోతాడు)

(తెర)

# శాంతిదూత

## పాత్రలు

| | |
|---|---|
| దుర్యోధనుడు | వాసుదేవుడు |
| శకుని | ధృతరాష్ట్రుడు |
| కంచుకి | ఒక సభ్యుడు |

[హస్తినాపురం. సభాభవనం. చాలా మంది కూర్చోడానికి ఏర్పాట్లు. ఇద్దరు ఎడా పెడా నడుస్తూరాగా, దుర్యోధనుడు ఠీవిగా వస్తాడు, అతడు చామనచాయ, తెల్లపట్టుదుస్తులు ధరిస్తాడు. రత్నాల కిరీటం పెట్టుకుంటాడు. అతడు రాగానే అంతా నుంచుంటారు]

—(ద్రోణుడితో) గురువర్యా, వందనం. ఈ కూర్మాసనం అధిష్ఠించండి.

—(భీష్ముడితో) పితామహా, నమస్కారం. ఈ సింహపీఠం అలంకరించండి.

—(శకునితో) మామా! ఇదుగో మీ చర్మపీఠం!

—అందరూ దయచేసి కూర్చోండి. కూర్చోరేం? ఓహో అదా! రాజు కూర్చోలేదనా? ఏమి మీ రాజభక్తి! సరే నేనూ కూచుంటాను. మిత్రమా కర్ణా! నువ్వు నా కుడి పక్క కూర్చో. మహాజనులారా! మన సైన్యం పదకొండు అక్షౌహిణీలు. దీనికి సర్వసేనాధిపతిగా అర్హతగల వ్యక్తిని నియమించాలి, చెప్పండి. (అని ఆలకింపు నటించి) ఏమిటి

అంటున్నావా ? గాంధారరాజు ప్రథమంలో చెప్పాలనా ? సరే, మామా !

శ—గాంగేయుడు ఉండగా ఆపదవికి మరొకపేరు ఎట్లా తోస్తుందీ ?

దు—తథ్యం మామా, తథ్యం. పితామహా ! నా ఇష్టం కూడా అదే. భేరీలు మోగించుతాం, శంఖాలు ఊదుతాం. జలధర సమయంలో చెలరేగే సముద్రతరంగాల ఘోష స్ఫురించాలి. భీష్ములవారికి సర్వసేనాధిపత్య అభిషేకమహోత్సవం ! యోధలోకం యొక్క హర్షధ్వానులతో మన చెవులు చిల్లులుపడగలవ్. ఆ నినాదాలతో శత్రునాయకుల హృదయాలు చీలగలవ్.

కంచుకి—(ప్రవేశించి) జయమురాజా ! పురుషోత్తముడైన నారాయణుడు పాండవరాయబారిగా వచ్చాడు.

దు—(కోపంగా) బాదరాయణా ! బుద్ధి తక్కువగా మాట్లాడకు. గొల్లవాడైన దామోదరుడు, కంసభృత్యుడు,- పురుషోత్తముడా ? జరాసంధుడి చేత తన్నులు తిని, స్థలమూ ఐశ్వర్యమూ పేరూ కూడా పోగొట్టుగుని పారిపోయిన మనిషి పురుషోత్తముడా ? నా నౌకరువైన నీకు ఉండ తగ్గ ప్రవర్తనేనా ఇది ! వెనకా ముందూ చూసుగోకుండా నోటి కొచ్చింది అనేసెయ్యడమే ! నే నెవరో తెలుసా ? నీతల దక్కాలని లేదా ?

బా—(సాష్టాంగపడి మొక్కుతూ) అపరాధం. అపరాధం. తొందరలో రాచమర్యాద అతిక్రమించాను.

దు—అదీమాట. తొందర ఎవరికేనా ఉంటుంది. ఛీ. ఎవడూ ఆ వచ్చిన రాయబారీ ? ఇప్పుడు చెప్పూ !

కం—ఎవడో కేశవుడుట.

దు—ఎవడో కేశవుడుట ! మా బాగా అన్నావు! వాణ్ణి అల్లానే అనాలి. రాజకుమారులారా ! ఏం జేద్దాం కేశవుణ్ణి? సగౌరవఆతిథ్యం ఇద్దామా కేశవుడికి ? నా మతం అది కాదు. వాడికి తగ్గది కారాగృహం! అదే కృష్ణజన్మ స్థానంగదా. కృష్ణుణ్ణి చెరలో పెడితే, పాండవులకి కళ్ళుపోతా యన్న మాట గుడ్డివాళ్ళని త్వరగా జయించవచ్చు. ఒక సంగతి. వాడు రాగానే ఎవ్వడూ నుంచో కూడదు. ఎవడేనా నుంచుంటాడా, వాడికి పన్నెండు కానులు అపరాధం విధిస్తాను. మరవకండి.

—బాదరాయణా ! ద్రౌపదిని సభలోకి ఈడ్చుగుని రావడపుబొమ్మ ఇట్లా తే. నేను దానికేసి చూస్తూన్నట్టు నటిస్తే కేశవుడు వచ్చినప్పుడు లేవకుండా కూచోవచ్చు !

బా—(బొమ్మ తెచ్చి ఇస్తాడు)

దు—ఎంత చక్కనిబొమ్మ ! ద్రౌపదిని జుట్టుపట్టుగుని ఈడ్చుగొస్తున్నాడు, మా దుశ్శాసనుడు! ద్రౌపది రాహుగ్రస్త చంద్రబింబంలా ఉంది. భీమార్జున నకుల సహదేవులు పాండిపడు చూస్తున్నారు ప్రతిఘటించడం తప్పనిసమ్మో యున్నట్టి

రుడు-వాళ్ళని వారిస్తున్నాడు. ఏడుస్తూన్న ద్రౌపదిని చూసి సంతోషిస్తున్నాడు, ద్యూతశిఖామణి, శకుని! భీష్మద్రోణులు ఆ దృశ్యం చూడలేక మొహాలు కప్పెట్టుకుంటున్నారు. మంచి భావయుక్తంగా ఉంది. రంగులు తేజోవంతంగా ఉన్నాయి. బాదరాయణా! నువ్వోళ్ళి రమ్మను ఆ రాయబారిని, పక్షిమీంచి దిగి- పక్షివాహనుణ్ణి కాదూ, అతని గిర!

మిత్రమా, కర్ణా! కృష్ణుడి చర్మమే కాదు హృదయం కుడా నలుపే. వీడిప్పుడు పాండవరాయబారిగా వస్తున్నాడు. యుధిష్ఠిరులవారి ఆడంగి రాయబారం వినడానికి సిద్ధంగా ఉండు.

వాసుదేవుడు—(బాదరాయణుడు తీసుకు రాగా వచ్చి) భీమార్జునుల క్రోధాగ్నిలో కౌరవవనం త్వరలోనే భస్మం కానుంది. ప్రశస్తమైన శిబిరాలు, కాంతులు కక్కే కవచాలు, శాలల్లో నిలవలేకుండా హేషించే గుఱ్ఱాలు, యుద్ధభూమికి ఎప్పుడా వెళ్ళడం అని ఘీంకరించే ఏనుగులు—ఇవన్నీ నేలపాలు కానున్నాయి- దుష్ప్రసంగీ, సుగుణద్వేషీ అన్యాయవాదీ అయిన ఈ దుర్యోధనుడి మూలంగా!

(అందరూ తొందరగా లేస్తారు)

దు—(కూచుని) అరే! అంతా లేస్తారేం? సావకాశంగా కూచోండి. అరే! వినిపించుగోరేం? ఎవడో కేశవుడు వస్తే మీరు కంగారు పడతారేం! అపరాధం వేస్తాన్నాను జ్ఞాపకం ఉంచుగోండి. నేను ప్రభువునిక్కడ.

వా—ఇదుగో! దుర్యోధనుడు క్షేమమా!

దు—(కంగారుతో కుర్చీలోంచి లేచిపోయి తనలో) అరే! నేనూ లేచిపోయానే! వీడిదగ్గిర ఎదో యక్షిణీ ఉంది గావును. చూస్తాగా! (పైకి) ఓ రాయబారీ! ఇక్కడ ఒక పీఠం ఉంది. దయచేసి కూర్చో.

వా—భీష్మ ద్రోణులు ఆసీనులుకండి. సదస్యులు కూచోండి. (దుర్యోధనుడి చేతిలోని బొమ్మ పరికించి) అంత ప్రశస్తమైన చిత్రమూ అంత దీక్షగా చూస్తున్నావు రాజా! ఎదీ! (అని తీసుగుని చూసి) ఛీ! ద్రౌపదిని అవమానించ డపు చిత్రమా! నీ స్వాతిశయాంధకారంలో జ్ఞాతివంచన శూరకృత్యం అనుకుంటున్నావు. చేసిన పాడుపని తనే సభాముఖాన్ని డప్పువేసుగు నేటంతగా సిగ్గూ మర్యాదా విడిచి పెట్టినవాడు భూమిమీద ఉంటాడా? చాలుగాని, ఆ బొమ్మ దూరంగా పెట్టించు, ఈపాటికి.

దు—బాదరాయణా! పోసి ఈ బొమ్మ లోపల పెట్టిరా.

బా—(బొమ్మ తీసుగు వెడతాడు)

దు—రాయబారీ! పాండవులు క్షేమమా?

వా—ఆ. నీదయవల్ల, అంతా క్షేమం. నీ క్షేమం కనుక్కో మన్నారు.

దు—ప్రస్తుత విషయం ఏమిటి?

షా—యుధిష్ఠిరుడి మాటిలివి: పడరానిపాట్లు పడ్డాం. గడువు కాలం అయిపోయింది. వారసత్వం చొప్పున మాకొచ్చే అర్థభాగం మాకిచ్చెయ్—అని

దు—ఏం వారసత్వం? వాళ్ళకి భాగం ఎక్కణ్ణించి తేగలం? మునిశాపంతో హడలెత్తిపోయి పాండురాజు భార్యల్తో కాపరం చేసే కోరికే చంపుగున్నాడు గదా! తరవాత ఎట్లాగో పుట్టుగు వచ్చిన ఈ అభాజనులకి పిత్రార్జితంలో భాగం రాగల హక్కేదీ?

షా—నువ్వు వంశాల పుట్టుపూర్వోత్తరాలలో పాండిత్యం ఆర్జించినట్టు కనిపిస్తున్నావు, మిత్రమా! సంతోషం. దయచేసి, మీ నాన్నగారి జననం గురించి చెప్పు. పోనీ చెబుతాను విను. విచిత్ర వీర్యుడు అతిచరించి నిర్వీర్యుడు కాగా, అంబికకి వ్యాసుడు ప్రసాదించిన కానుపు ధృతరాష్ట్రుడు! ధృతిరాష్ట్రుడు రాష్ట్రం ధరించినవాడే కాని, రాష్ట్రానికి వారసుడు ఎట్లా అయాడూ? అందుచేత, అడ్డదిడ్డపు వాదన్లు కట్టెయ్. పరస్పర వైషమ్యాలు బలిశాయంటే రాజా, కురువంశం చూస్తూండగానే నామావశిష్టం అవుతుంది. పాండవులు నిర్బంధనగా కోరే భాగం ఇచ్చెయ్! చేతులారా ఇయ్యి, మరి హరామీ చెయ్యకు.

దు—రాయబారీ! నువ్వు రాజకీయవిషయపరిజ్ఞానశూన్యుడవ్. రాజత్వం అనేది ధీరులైన క్షత్రియులు శత్రు

వృల్నీ మట్టి మొట్టి ఆర్జించుగోవలిసిన పదవేగాని అర్థిస్తే వచ్చేది కాదు. ముష్టివేసినట్టు దరిద్రుడికి దానం చెయ్యడానికి వీలైందికాదు రాజత్వం అంటే! వాళ్ళకి రాజ్యం కావాలిసొస్తే పోట్లాడి ఆర్జించుగోమను, సత్తాఉంటే! లేకపోతే చక్కగా సన్యసించి, శాంతంగా జపంచేసుగోమను.

వా—అల్లాగే చెబుతాను. పోసీ, దుర్యోధనా! వాళ్లు జ్ఞాతివాళ్ళు గనక, కాస్త కనికరం చూపించు. జ్ఞాతుల్నీ విహితుల్నీ మోసగించావంటే, నీ ఉద్యమాలన్నీ నశిస్తాయి, నీవైభవం యావత్తూ నీళ్ళు కారిపోతుంది.

దు—నీమేనమామ కంసుడిమీాద ఏమాత్రం కనికరం చూపించావ్, రాయబారీ!

వా—అందులో నాతప్పు ఏముందీ? నాతల్లిదండ్రుల్ని చెఱసాలలో పెట్టాడు, వాళ్ళ పసిపిల్లల్ని తనపొట్టని పెట్టుగున్నాడు. అవేందుకూ, తన స్వంత జనకుణ్ణే కారాగృహంలో ఉంచాడు. పోదూ, అతణ్ణి చంపింది మరణదేవతే, నేనుకాదు.

దు—ఆఁ ఆఁ. ఏమిటి అన్నావు? మరణదేవతా! కాదుకాదు. అతణ్ణి చంపింది, నీమాయలు —అని చెప్పడం కొంతనయం. కంసమరణం విని జరాసంధుడు నిన్ను ఎదుర్కోవచ్చేసరికి నువ్వు తారెత్తిపోయి తోకముడిచేశావు. అప్పట్లో ఏమైంది నీధైర్యమూ అంటా!

వా—దుర్యోధనా! దేశకాలపరిస్థితుల్ని అనుసరించి, జ్ఞానులు తమధైర్యం ప్రకటిస్తారు. కాని, నీ వినోదాలు మరి చాలించు. నీజ్ఞాతుల యెడల అంతఃకరణ వహించు. అట్లా చెయ్యడం నీకు ఇహంలోనూ పరంలోనూ కూడా శ్రేయస్కరం.

దు—నీ చర్విత చరణం పూర్తిగా వ్యర్థం. పైగా, వాళ్ళు మాకు జ్ఞాతులేమిటీ? ఎల్లా అవుతారూ? వాళ్ళు దేవుళ్ళకి పుట్టారు, నేను మనుష్యులకి పుట్టాను. మరి జ్ఞాతి ప్రసంగం చాలించు.

వా—సరే సరే సరే. దుర్యోధనా? అర్జునుడి బల సత్వాలు నువ్వెరుగవూ?

దు—నే ఎరగను. లేందే? ఏమున్నాయి చెప్పు.

వా—అర్జునుడు శివుణ్ణి మంచినీళ్ళు తాగించాడు. ఖాండవారణ్యంలో తన అస్త్రప్రజ్ఞ చూపించి ప్రళయాన్ని అరికట్టేశాడు. ఒంటరిగా పోరి భీష్మాదుల్ని మళ్ళించేశాడు. చిత్రసేనుడు కట్టకట్టి చావగొట్టి ఈడ్చుకుపోతూంటే, నిన్ను విడిపించి, మీ యింటిదగ్గిర దిగబెట్టాడు. అందుకని, ఓ ధృతరాష్ట్రుడిగారి అబ్బాయీ, పాండవులు తమ స్వామ్యంచొప్పున కోరే అర్థరాజ్యమూ ఇయ్యి. లేకపోతే, తమ అర్థరాజ్యమే కాదు తక్కిన అర్థరాజ్యమే కాదు, భూమిమీద పోడిగా ఉండే నేల యావత్తూ పాండవులు జయించేస్తారు.

దు—గడ్డిపరక మోసినంతభూమేనా వాళ్ళకివ్వను. ఎవరొచ్చినాసరే, వాయుదేవుడు భీమరూపంలో వచ్చినాసరే, ఇంద్రదేవుడు అర్జునాకారంలో వచ్చినాసరే! ఈ రాజ్యాన్ని తన శక్తితో తను కాపాడాడు, మాతండ్రి. నాశక్తితో నేను కాపాడతాను. విన్నావా! గడ్డిపరకైనా ఇవ్వను.

వా—వంశం యావత్తూ సిగ్గుతో తలలు వంచుగునేటట్టు చెయ్యగల నేర్పుగలవాడవేకాని, గడ్డిపరకసంభావన ఎందుకిప్పుడూ ?

దు—గడ్డిపరక ఎందుకా, మేతకి! నువ్వు గొల్లవాడవు కావుమరీ! అసలు నువ్వు ఒక ఆడదాన్నీ ఓ గుఱ్ఱాన్నీ ఓ పశువునీ ఓళ్ళిద్దరు సాముపల్ల బతికేవాళ్ళనీ చంపిన శూరుడివి, క్షత్రియుడితో మాట్లాడ్డానికితగ్గ గౌరవం నీకు లేదు.

వా—మరి నేనిక్కడ ఆగి లాభంలేదు. వెడతాను.

దు—శీఘ్రంగా! ఆ వెళ్ళడం తిన్నగా పశువుల సాలలోకి వెళ్ళు, పశువుల డెక్కలవల్ల రేగేధూళి ఒంటపడితే కొంతకాకపోతే కొంతేనా తగ్గుతుందేమో నీ ఒంటినలుపు!

వా—వెళ్ళేలోపల యుధిష్ఠిరుడు చెప్పవలిసిందిగా కోరిన రాయబారం చెప్పి మరీ వెడతాను.

దు—ఛీ! ఎక్కడో! నాతో మాట్లాడ్డానికి నీకు అర్హత లేదంటూంటే, వినిపించుగోవేం? నేను ఛత్రచామర

కిరీటాని లాంఛనాలు గలవాణ్ణి. ఘనపురోహితులు నా శిరస్సుమీద పవిత్రజలం అభిషేకించారు. నా సామంతుల దగ్గిర సేవచేసుకోవలిసిన నీబోటిగాళ్ళతో మాట్లాడ్డం నేను అసహ్యించుకుంటానుస్మీ !

వా—నీ మోసంవల్ల, నీ దుర్జనత్వంవల్ల, నీ కాకిచూపు వల్ల, నీ మనసువిషంవల్ల. కౌరవ వంశనాశనం త్వరలోనే జరుగుతుంది.

(తక్కినవాళ్ళతో) రాజకుమారులారా ! నాకు సెలవు.

గు—ఇదేమిటి ? వీడు మెల్లిగా జారిపోయేట్టున్నాడు ! వీడు రాయబారిత్వాన్ని దుర్వినియోగపరిచాడు. వీణ్ణి కట్టెయ్యండి.

దుశ్శాసనా, దుర్మర్షణా, దుర్ముఖా, దుర్బుద్ధీ,, దుష్టేశ్వరా! వీడికి త్రాణాలేదు, శౌర్యమూలేదు కాని, మనల్ని తిట్టి పోశాడు. మీరంతాకుడా పిరికిపందలేనా? ఈ గొల్లవాడంటే మీ కందరికీ భయమేనా ? మామా ! వీణ్ణి కట్టెయ్, ఈ కేశవుణ్ణి. అరే, నీవల్లాకాదూ ? నువ్వే పడిపోయావే ?

శ—నేను పడిపోలేదు.

దు—అయితే ఉండండి. నేను స్వయంగా పాశంవేసి వీణ్ణి పట్టేస్తాను.

(అని ఒక తాడు చివర ఉరిఅమర్చి విసరడానికి సద్ధస్తూ.)
అయ్యో! వీడు పెరిగిపోతున్నాడే! అయితే ఉరి ఇంకా పెద్దదిగా చేస్తాను. (అని ఉరి పెద్దదిగా చేస్తూ) అరే! మళ్ళీ వీడు సూక్ష్మం అయిపోతున్నాడే! (అని మళ్ళీ ఉరి చిన్నదిగా చేస్తూ) అరే, మళ్ళీ పెరుగుతున్నాడే! కాదు-ప్రతీమనిషి పక్కనీ ఒక కేశవుడున్నాడే!

ఏయ్! జనం! మీ పక్కనేఉన్నాడు కేశవుడు. నా ఆజ్ఞప్రకారం మీరంతా మీపక్కనుండే కేశవుణ్ణి బంధించండి. ఔరా! మీరు పరమమూర్ఖుల్లా ఉన్నారే! కేశవుణ్ణి బంధించండర్రా, అని నేనంటే మిమ్మల్ని మీరే బంధించుకుని పడిపోతున్నారు, మీకేం వినాశకాలం?
ఒకడు—మాపక్కని ఎవరూ లేరు. నేం మమ్మల్ని బంధించుకోలేదు, పడిపోనూలేదు.

దు—మీరంతా అబద్ధాలాడుతున్నారు. నాకు స్పష్టంగా కనిపిస్తూంటేనే! ఉండండి. నా ధనుర్బాణాలు తెచ్చి, ఈ అనేక కేశవుల్ని గురిచేసి చంపేస్తాను. ఉండవోయ్, కేశవా! ఒళ్ళంతా నా బాణాలదెబ్బలతో గాయాలుపడి నువ్వు ఇంటికి వెళ్ళేసరికి పాండవులు నీమీదపడి ఏడ్చి ఏడ్చి కళ్ళు పోగొట్టుకుంటారు! (అంటూ వెళ్ళిపోతాడు.)

వా—(తనలో) పాండవులు మున్ముందు చెయ్యబోయే పని నేను సుదర్శనచక్రాన్ని పిల్చి చెయించను. చక్రాన్ని

పిల్చానా, పర్వతాలు తల క్రిందవుతాయి, సముద్రాలు ఎండుతాయి, చుక్కలు రాలిపోతాయి. ఈ దుర్యోధనుడు లెక్ఖెమిటి! కాని ఇప్పుడితణ్ణి చంపేస్తే, ఇతడుమాత్రమే నశించి, ఇతడితో ఉండే ఇతరదుర్మార్గులు అనాథులై పోట్లాడ్డానికి ధైర్యంలేక, దాక్కుని తప్పించుకుంటారు, దుష్టులు తప్పించుకుపోతే, నాపని నెరవేరదు. నేను ఇంకా సంకల్పిస్తే, నందక, సారంగ, కౌమోదకీ పాంచజన్యాలు వచ్చేస్తాయి. ప్రళయవాయువులు జనింపచేస్తూ గరుత్మంతుడు వస్తాడు. ఆ సంకల్పం మరి చెయ్యను.

—(పైకి) మహాశయులారా! నేను పాండవశిబిరానికి వెళ్ళిపోతాను.

ధృ—(ఎ. ను. నించి ఎవరో నడిపించుకురాగా వచ్చి) వెళ్ళకూడదు, వెళ్ళకూడదు. వాసుదేవుడు ఆగ్రహం వహించి వెళ్ళకూడదు.

వా—వృద్ధరాజా! వెళ్ళలేదు, ఇంకా ఇక్కడే ఉన్నాను.

ధృ—ఎడీ ఎడీ! ఆ ధన్యనారాయణుడు; పాండవరక్షకుడు, సజ్జన మిత్రుడు, దేవకీనందనుడు!

(అని సాష్టాంగ పడతాడు) క్షమించు, మన్నించు వాసుదేవా! ఈ పాద్యం స్వీకరించు.

వా—సరేలే. రాజా! సంధి మాటలు విషం అయి నాయి. కనక, రాబోయే సంగ్రామంలో ఎవరిచంకం ఎల్లా అయినా కీడూ మేలూ నీమీదే నిలుస్తుంది, చివరికి! మీ అబ్బాయిూ వీళ్ళు పాడుపన్లు జంకకుండా కుడా చేస్తున్నారు. శాంతిపథం ప్రశస్తం, నాకు, నీకు, కులానికి ఈ రాజకోటికి ఈ భూమికి! పోరుపొసిగితే అందరికీ ఆపదే గనక పొందు చేకూర్చు. నీచేతులో ఉన్న పనికి నేనేం చెప్పాలీ! ఇక్కడి వీరులూ అక్కడి వీరులూ రణరంగం మీద ఎదురై చచ్చి పోయే కంటె కలిసి నీకొలువుకూటంలో ఉంటే ఎంతనయం! శాంతిచెయ్! ఉపేక్ష చెయ్యకు. ప్రజలకి నువ్వు తండ్రివి. ఊరుకుని ప్రజాద్రోహం తలపెట్టకు. పాండవ కౌరవుల్లో ఎవళ్లు చచ్చినా ఏడుపు నీకే మిగుల్తుంది. తండ్రి చచ్చిన ఆపాండ వుల్ని చిన్నప్పణ్ణించీ కనిపెట్టినవాడివి గనక మధ్యలో జారవిడవ కుండా వాళ్ళని గట్టెక్కించాకా ఆమకో! సత్యధర్మాల్ని కని పెట్టేవాడు ఉంటాడు. పాండవులభాగం ఇచ్చెయ్యడం ఆచర ణీయం, ధర్మం, సముచితం, శక్యం. వాళ్ళ సత్యధర్మాలూ నీకు తెలుసు, వాళ్ళచేవకుడా నీకు తెలుసు. దిగ్విజయం చే సాచ్చిన వాళ్ళని మాయజూదంలో ఓడించి ఐశ్వర్యం ఊడిపించి, ఆడదాన్ని సభకి ఈడిపించి, అందర్నీ కలిపి అడివికితోల్తే, ధర్మరాజు ఆ పాట్లన్నీ పడి, ప్రతిజ్ఞ చెల్లించు గుని, తమ్ముళ్ళని ఓచేత్తో అణిచిపెట్టగుంటూ, కళ్ళనీళ్ళ రెండోచేత్తో ఒత్తుగుంటూ,—అంతా అనుభవించి,

ఏమీ జరిగుండనట్టు ఇంకా కలిసి ఉందాం అని నీతో చెప్పమన్నాడు. అటువంటి ధర్మరాజుకి సాటి ఎవరు పోదూ ఈ ఘటాల్లోనూ! వాళ్ళు శాంతశూరులు. మీ యందుండే భక్తి గౌరవాల కొద్దీ శాంతి కోరుతున్నారు. మీకు శాంతి సయించకపోతే యుద్ధానికి సర్వసిద్ధంగా ఉన్నారు. శాంతి మార్గయుద్ధ మార్గాల్లో నీకు ఏది పథ్యంగా అంటుందో అదే స్వీకరించు, రాజా!

ధృ—కటాక్షించు, వాసుదేవా!

వా—సరే. నీ కోరిక ఏమిటి రాజా!

ధృ—నీకు తృప్తి కలగడమే నా కోరిక!

వా—సరే. సెలవు రాజా!

వెళ్ళిపోతాడు.

( తెర )



భమిడిపాటి కామేశ్వరరావు

జననం ఏప్రిల్ 1897. పాఠశాలా విద్య - ఏలూరు, నర్సాపురం. కాలేజీ చదువు - కాకినాడ, రాజమహేంద్రవరం. 1918 లో బి. యే. (గణితశాస్త్రం). 1922 లో యల్. టి. నాటినించి వీరేశలింగం హైస్కూలులో గణితాధ్యాపకులు. ఆ పాఠశాల ప్రధానోపాధ్యాయులుగ జూన్ 1953 లో ఉద్యోగ విరమణము. పద్యపఠనంమీదా అభినయంమీదా ఆసక్తి కలవారు.

జీవితంలోని వాక్చమత్కృతుల సేకరణ మొదటి కృషి. 'భారతి' కి 1926 నించి సంబంధి. చమత్కార సంభాషణలూ 'త్యాగరాజు ఆత్మవిచారం' అనే త్యాగరాజ రచనల సారమూ ప్రకటించారు. భాగయ్య, పర్వతాలు, శఠకోపం, శానయ్య, మాలోకం మొదలైన పాత్రల పరిచయం సర్కార్లలోనూ, రాయలసీమలోనూ, నైజాం ప్రాంతాలలోనూ కలిగించారు. ఇటీవలి నాటకాలూ కథలూ ప్రశంసలూ అచ్చు కానున్నవి.